# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 4 | రాజమహేంద్రవరము 1-8-1981 | సంచిక 19


## — * ఈ సంచికలో * —



16—8—81 సంచికలో ఆంధ్రసాహిత్యంలో పింగళి సూరన స్థానం, కృష్ణశాస్త్రి బహుకాల దర్శనం, కన్నడ సాహిత్యమున 9, 10 శతాబ్దములు, జాషువా పౌరాణిక రూపకములు మొదలగునవి ఉంటాయి.


— * 1, 16 తేదీలలో ప్రచురింపబడును * —

చందా :

సంవత్సరమునకు రు. 12—00.

అర్ధ సంవత్సరమునకు రు. 6—50.

విడిప్రతి 60 పై.

★ సమాలోచన ★
* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *
సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి
Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.

# ముక్తలక్షణ కౌముది - ఒక సమాలోచన

- శ్రీ ఎం. రామచంద్రుడు.

శ్రీమంతంబైన తెలుగు సాహిత్య సీమలో ఎన్నియో లక్షణగ్రంథములు లక్ష్యగ్రంథములు వెలువడి తత్సాహిత్యమునకు పుష్టిని తుష్టిని చేకూర్చుచున్నవి. తెలుగులో రేచన, లింగమగుంట తిమ్మకవి ఇత్యాదులు ఛందోగ్రంథములు వెల్వరించినను కేవలము అప్పకవి రచించిన నామలింగానుశాసనము మాత్రమే కాల పరీక్షకు తట్టుకొని ప్రామాణికమై నిలిచినది. అటులే వ్యాకరణ విషయంలోకూడ 11 వ శతాబ్దిలోని నన్నయ మొదలుకొని కందుకూరి వరకు లాక్షణికు లెందరో లక్షణములను నిర్దేశించినను 18 వశతాబ్దిలోని చిన్నయసూరి రచించిన బాలవ్యాకరణమే తెనుఁగు భాషనభ్యసించు వారెవ్వరికైనను, తెనుఁగుతో సంబంధముగల వారి కెవ్వరికైనను శిరోధార్యమైనది. బాల వ్యాకరణములో కొన్ని విడిచి పెట్టబడినందు వలన దానికి పూరణముగా అతని శిష్యుడైన బహుజనపల్లి సీతారామాచార్యుల వారు ప్రౌఢ వ్యాకరణమును సృష్టించినారు. విశేష ప్రచారమందిన బాల ప్రౌఢ వ్యాకరణములకు పూరణ గ్రంథముగా శ్రీవంతరాం రామకృష్ణారావుగారు 1974లో ముక్తలక్షణకౌముది అను పేరుతో ఒక గ్రంథం రచించినారు. ఈగ్రంథమందు శ్రీవంతరాం రామకృష్ణారావు గారికి తెలుగు భాషపైగల అధికారము, బహుముఖీన ప్రజ్ఞ విదితమగుచున్నది. బాలవ్యాకరణమునకు ప్రఖ్యాత వ్యాఖ్యాత అయిన వజ్ఝల వారికి తగిన శిష్యుడనిపించుకున్నారు. ఈగ్రంథమును వారి గురువుగారికి సమర్పించి గురుభక్తిని చాటుకొనుట ముదావహము. పూర్వ వ్యాకర్తలు చెప్పక విడిచి పెట్టబడిన లక్షణములను, పూర్వవ్యాకర్తలు చెప్పినను పునరుక్తములుగా ఇందు ప్రవేశించిన విషయములను నా బుద్ధికి అందిన వానిని చర్చింతును.

ముక్త = విడువబడిన; లక్షణ=శబ్ద శాస్త్రమునకు, కౌముది=వెన్నెల,పూర్వ వాక్యర్తలు చెప్పని శాస్త్రమును చెప్పునట్టి గ్రంథమే ముక్తలక్షణ కౌముది.

ప్రతి శాస్త్రములోను ప్రత్యేక సంజ్ఞలుండుట శాస్త్ర మర్యాద. ఆసంజ్ఞలలో ముఖ్యమైన కొన్నింటిని శాస్త్రకారులు ప్రప్రథముననే సంజ్ఞా పరిచ్ఛేదమున నేర్పఱతురు. అట్లైనచో నాయాశాస్త్రముల పఠన పాఠనములు సుబోధములగును.

'హరిం వందే; హరిః కరోతి-ఇత్యాద్యుదాహరణములలోని అనుస్వారము విసర్గ ఇక్కునకు పరమైన అచ్చులగుటచే' ఇకోయణచి'యను సంస్కృత వ్యాకరణ సూత్రముచే యణాదేశము రావలెనుగదా! యని శంకించగా నిజమేగాని 'పూర్వత్రాసిద్ధమ్'అనుసూత్రముచే యణాదేశము రాలేదని సమాధానము చెప్పబడినది. ఇంతకు అనుస్వారము, విసర్గ అచ్చులలో చేరిననే కదా యణాదేశమునకవకాశ - ముండుట. కావున నివిరెండును అచ్చులు అని ముక్తలక్షణకౌముది అభిప్రాయము. సరేగాని అనుస్వార విసర్గలు అచ్చు లనుట ఉక్తలక్షణమా? (పూర్వవ్యాకర్తలచే చెప్పబడినధా) ముక్తలక్షణమా ?

చిన్నయసూరి 'సంస్కృతమునకు వర్ణములేబది' అను ప్రప్రథమ సూత్రముననే అకారాదుల నుదాహరించి వివరణమున 'ఇందకారాదులు అచ్చులని కకారాదులు హల్లులని విశదీకరించినాడు.అనుస్వార, విసర్గములు వర్ణముల సహాయము లేనిదే ఉచ్చారణ యోగ్యములుకావు. కనుక 'అం, అః' అనురీతిలో అకారము ప్రక్కన చేర్చిచూపినాడు. కకారాదులు హల్లు లనుటచే అకారము మొదలుకొని కకారము వరకు గల వర్ణములు (విసర్గాంతము) అచ్చులని చెప్పబడినట్లేకాగా అనుస్వార విసర్గలు అచ్చులనుట ఉక్తలక్షణమే గాదా!

వీరి గురువుగారైన వజ్ఝల చిన సీతారామశాస్త్రిగారు బాల వ్యాకరణోద్యోతములో మొట్ట మొదటనే అనుస్వారవిసర్గములు ఉభయములని వివరించి

యున్నారు. ఉభయములనుటచే నా రెండు అచ్చులు హల్లులు నగునని యర్థము కావున వంతరాం రామకృష్ణారావుగారి ప్రప్రథమ సూత్రము ఉక్తలక్షణమే. మరియు పూర్వ వ్యాకర్తలచే నుక్తమైనది. వీరిచే నుక్తముకాగా పునరుక్తమై వ్యర్థమగుచున్నది.

'సంస్కృత శబ్దాంతర్గతంబులగు వర్గ పంచమంబుల కాంధ్ర భాష యందెల్ల యెడల పూర్ణబిందువగు' (6) ఈ సూత్రమే సంజ్ఞను తెలుపుటలేదు. కనుక సంజ్ఞా పరిచ్ఛేదమున నుండదగినది కాదు. ఇతర పరిచ్ఛేదములో నుండదగును. 'దంత్యతాలవ్యచజలు మైత్రింబొరయు (ముక్త. ల. కా. 12); దంత్య తాలవ్యచజలు సవర్ణంబులు (బాల. వ్యా. సంజ్ఞా. 7) అను చిన్నయసూరిగారి సూత్రముచే గతార్థమై వ్యర్థమగుచున్నది.

దీర్ఘము మీది ఖండ బిందువునకు కొండొకచో పూర్ణబిందువు వైకల్పికముగ నగును. 19. ఉదా: ఆఁక; ఆంక, వీఁక, వీంక, లోంగొను. ఇవి సాధ్య పూర్ణములుగా కానంబడియెడి. ఉదా:_ వీండు, వాండు లోంగొను_ఇది 'దీర్ఘముమీద సాధ్య పూర్ణములేదు' అను ఉక్త లక్షణమునకు నవరణమే గదా!

శబ్దశాసనాదుల మతంబున గొన్ని యెడల యకారము తెనుగు మాటలకు మొదట గలదు' (2) ఇది శబ్దశాసనాదుల మతమును తెలియ జేయుచున్నది గదా! అట్లైన 'ముక్తలక్షణ మెట్లగును_? ఉక్త లక్షణమని చెప్పక తప్పదు.

రాముఁడు, రాముండు_ అనుచోట్ల వరుసగా ఉత్తునకు అరసున్న, పూర్ణబిందువు పరముగ నున్నవి. కాగా ఉత్వసంధి వచ్చునని శంకించి 'సమానపదంబు నందు సంధిలేదు' అని నిషేధింపబడిబది. కనుక నిది ముక్తలక్షణ మనబడును.

'అత్తునకు సంధిబహుళము' అనుసూత్ర వివరణమైన 'బహుళగ్రహణముచే స్త్రీ వాచక తత్సమ సంబోధనాంతములకు సంధిలేదు' _ అను వాక్యమును నవరించు నట్టి' అత్తునకు సంస్కృతీయంబునకు గొన్ని యెడల సంధి గానంబడియెడి' (ముక్త. సంధి 2) అను సూత్రమును సవరణాత్మక లక్షణమేగాని ముక్తలక్షణము గాదు.

జైనులార+ఎన్నడు=జైనులారెన్నడు; పాతకులార + అని = పాతకులారని_ పాతకులారని ఇత్యాద్యుదాహరణములు 'అత్తునకు సంధి బహుళము' అనుదానిలో బహుళపదముచేతనే సిద్ధించుచుండగా' ఆరగాగమంబుతుది యత్తునకొకానొకచో సంధిచూపట్టెడి (ముక్త. సంధి_3) అని (ముక్త లక్షణముగా సూత్రించుట సమంజసమా_?

ముక్తలక్షణ కౌముదిలో అత్తునకు సంధి విధించిన చాలా సూత్రములు బహుళగ్రహణముచే సవరించుకొనదగినవే. 'వ్యాఖ్యానతో విశేషప్రతిప్రత్తిః' అని గదా అభియుక్తోక్తి.

ముసలి + అమ్మ = ముసలమ్మ, రాతిరి+ ఎల్లన్ = రాతిరెల్లన్ మున్నగు ఉదాహరణములను సిద్ధింపజేయు 'ఒకానొకచో కర్మధారయంబు నందిత్తునకు సంధివైకల్పికంబుగనగు. ఇత్యాదులు ముక్తలక్షణములే.

ద్వితీయకును కొండొకచో నుగాగమంబగు ఉదా:_ సత్యవతినిన్. నాకి శబ్దంబు బహుత్వంబు నందు ప్రయోగింపఁబడును. ఉదా: నాకులు ఇత్యాదులు ముక్తలక్షణములు. కృతోత్కంబగు, సంస్కృతనామంబు సంబుద్ధి డుజ్ఞునకు కొన్ని యెడల లోపంబు గానంబడియెడి (ముక్త. తత్సమ_16) అనునది ఉక్తలక్షణమే. కృతోత్కంబగు సంస్కృతనామంబు సంబుద్ధి డుజ్ఞునకు లోపంబు విభాషనగు (బాల. వ్యా. తత _34) ఈ రెండుసూత్రములకు స్వరూప ప్రయోజనములలో భేదము లేదు కనుక పై సూత్రము అనవసరము.

ఉదంత సంస్కృత నామంబు మీఁది డుజ్ఞున ఉకారంబాదేశంబు విభాషనగు; ఉదా:_ విష్ణు, జరత్కారూ _ ఉకారము విధింపబడినందున 'జరత్కారూ' అనునది ఉదాహరణకు తగదు.

'అర్ఘాదుల కడ యచ్చున కుత్వంబును మీఁద వువర్ణకంబును వైకల్పికంబుగా నగు' (ప్రౌఢ. 25) అను సూత్ర మందలి ఆదిశబ్దముచే 'భక్తకూటువులు' అనునుదాహరణము గూడ సిద్ధించును. కావున అర్ఘాదులకుం బోలె కూటశబ్దంబు కడ యచ్చున కుత్వంబగు _ మీద వువర్ణకంబును వైకల్పికంబుగా నగును. (ముక్త. తత్స. 39) అనుసూత్రముఉక్త లక్షణమై వ్యర్థ నగుచున్నది.

'హాల తంబు ప్రథమైక వచనాంత తుల్యం బిందు నామం బగు' ఉగాగమంబును ద్విత్వంబును తుదిహల్లున కగు' అను బాలవ్యాకరణ సూత్రములచే 'కిమ్ము; కించిత్తు' మున్నగునవి సిద్ధించుచుండగా 'ముక్తలక్షణ కౌముది' యగు ఈ గ్రంథము 'ఒకానొకచో సంస్కృతప్రాతిపదికంబిందునామంబగు' అని సూత్రించి 'కిమ్ము; కించిత్తు' అని ఉదాహరించుట సమంజసము గాదు. ఇది ఉక్తలక్షణమే. కిమ్, కించిత్ అమనవి గూడ పదత్వసిద్ధికై ప్రథమైక వచనములు కాక తప్పదు గదా!

'సరిద్యోషిచ్ఛబ్దంబులు ప్రథమైక వచనాంత తుల్యంబులగు' (62) సరిత్తు; యోషిత్తు.

'ఉపనిషదాదులు ప్రథమైక వచనాంత తుల్యంబులుగఁ గానంబడియెడి' (64) ఉపనిషత్తు.

'కృచ్ఛబ్దంబు ప్రథమైక వచనాంత తుల్యంబగు (66) కృత్తు.

'దృక్ఛబ్దంబు ప్రథమైక వచనాంత తుల్యంబగు' (69) దృక్కు.

'తృట్ఛంబును బ్రథమైక వచనాంత తుల్యంబగు' (70) తృట్టు. ఇవియేవియు (62 సూ॥ మొదలుకొని 70 సూ॥ వరకు) ముక్తలక్షణములు గావు.

'వాడు లోనగునవి పూజ్యార్థంబులు నగు.' ఉదా:- వాడిటవచ్చు వాడొ యే నటకేగు దానవో. వాడు = నలుడు- ఇత్యాది సూత్రములు అర్థబోధకములై నిఘంటు కార్యమును నెరవేర్చుచున్నవి. గాని ప్రక్రియ చెప్పుచు వ్యాకరణ కార్యమును నిర్వహించుట లేదు.

ఈగ్రంథములో కొన్ని ముక్తలక్షణములున్నవి. మరికొన్ని ఉక్తలక్షణములున్నవి. మరికొన్ని పునరుక్తములున్నవి. ఇంక కొన్ని సవరణప్రాయములున్నవి. మరికొన్ని కేవలార్థ ప్రతిపాదకములున్నవి. కావున దీనిని కేవలము 'ముక్తలక్షణకౌముది' యనఁ జాలము. ప్రాచ్య కళాశాల విద్యార్థులకు పాఠ్యగ్రంథముగా పెట్టబడిన ఈగ్రంథము గ్రంథకర్త శ్రీ వంతరాం రామకృష్ణారావుగారి విశేష పరిశ్రమకు తార్కాణము.

—...—



# ప్రబంధ రత్నావళి - పరిశీలన

- శ్రీ ఇప్పగుంట సాయిబాబా.

బ్రహ్మశ్రీ ప్రభాకర శాస్త్రిగారు (౧౮౮౮ - ౧౯౫౦) ౧౯౧౮ లో 'ప్రబంధ రత్నావళి'ని మద్రాసునుండి వెలువరించారు. దీనికి ఆధారము తంజాపూరులోని సరోస్ఫీజీసరస్వతీ మహాలు గ్రంథాలయమునందు లభించు - పెదపాటి జగ్గన కూర్చిన ప్రబంధరత్నాకరము మఱియు కాకినాడలోని ఆంధ్రసాహిత్య పరిషత్తులోని అజ్ఞాతకవి సంతరించిన 'ఉదాహరణ పద్యములు'.

ప్రాతః స్మరణీయులు కవిగారు ౧౯౧౦ లో ప్రబంధమణి భూషణము'ను ప్రకటించి, ఆంధ్రవాఙ్మయంలో కూడ సంకలన గ్రంథముల ఉనికిని గూర్చితొట్టతొలిగా తెలిపారు. ప్రాచీన కావ్య ఉదాహరణములను ప్రపంచించుట చేత విశిష్ట కృతియై భాసిల్లినది 'ప్రబంధ రత్నావళి.'

౧౯౭౭లో ప్రబంధరత్నావళికి ద్వితీయావృత్తి వెలసినది. యథామాతృకముగ పునర్ముద్రించుట మిక్కిలి విచారకరము. ఇట్టి అద్వితీయ వైశిష్ట్యబంధురమయిన గ్రంథప్రకటనలో ప్రకాశకులు అభినివేశముచూపకుండుటచే తెనుగుసారస్వతాభిమానులకు ఆశాభంగము ఎదురైనది. ఇప్పటికినీ తెనుగు భాషలోని పూర్వ గంథ పరిష్కరణపట్లను, ప్రకాశనము పట్లను, ఉదాసీనత చూపుట మన భాషాభిమాన దారిద్ర్యమునకు చిహ్నము.

ప్రబంధ రత్నావళిని సమీక్షచేసితిమేని తెనుగు ప్రబంధావతరణ శ్రీకృష్ణదేవ రాయ యుగమున జరగినట్లు తలపబడు భావన పరాస్తమగు చున్నది. ఎఱ్ఱయకవికి సదకాలికుడు చిమ్మపూడి అమరేశ్వరకవి నిర్మిత 'విక్రమసేనము', చెన్నమల్లు శ్రీ గిరి ప్రణీత 'శ్రీరంగమాహాత్మ్యము', శ్రీనాథ సమకాలిక కవులగు జైరాజుముమ్మయ తవ్రాసిన 'విష్ణుకథా నిధానము' పొన్నాడ పెద్దన కృత 'ప్రద్యుమ్నము' ఆంధ్రకవి రామయ్య ప్రణీత 'విష్ణుకాంచీ మాహాత్మ్యము'- మొదలగు చతుర కృతుల ఉనికి ప్రబంధ రత్నావళి నుండి తెలియుచున్నది.

బొడ్డపాటి పేరయకవిని గొప్పరచనా పరునిగ ప్ర. ర. ద్వారా గుర్తించగలము. అనంతమాహాత్మ్యము, పద్మినీ వల్లభము, మంగళగిరి విలాసము, శంకర విజయము, సూర్యశతకము, మల్లికార్జున శతకము- రచించినట్లు అవగతమగుచున్నది. కాని ఒక్కటియు పూర్తిగ లభింపకపోవుట దురదృష్టము.

'కవిలోక బ్రహ్మ' అను బిరుదు వహించి శతాధిక కావ్యకర్తయగు పెదపాటి సోమయకవిని ఎవ్వ తెలుంగుదురు?- అని ఒకచోట వ్రాశారు కవిగారు. ప్ర. ర. ద్వారా అరుణాచలపురాణం కేదార ఖండము, త్రిపురజయము, శివజ్ఞానదీపికలు, కవిలోక బ్రహ్మ రచనలుగ మనకు తెలియు చున్నవి. అరుణాచల పురాణ అవతారికలోని సీసపద్యం ద్వారా పెదపాటి సోమన నలుబది ఇద్దరు సంస్కృత కవులను పేర్కొనుట సాహితీవిమర్శకులు గమనించవలెను. నాకు తెలిసినంత వరకు శ్రీనాథకవి, జక్కన కవి ఎక్కువ సంస్కృత కవులను సంభావించినవారు.

పెమ్మన భావన రచించిన 'అనిరుద్ధము 'గురించి శ్రీ కవిగారు ఇలా వ్రాశారు.' భావగాంభీర్యము, పదపుష్టి కలదై, అతి రమ్యముగ ఉన్నది.' కవిగారివద్ద అనిరుద్ధ తాళప్రతి గలదని వినికిడి. ఎందుచేతనో ప్రకటింపలేదు. అటులనే లక్కాభట్టు (క్షేమేంద్ర) - క్రీ.శ ౧౨౦౦ ప్రాంతము వ్రాసిన 'ముద్రా

మాత్మ్యము'ను ప్రకటించుచున్నట్లు కవిగారు శ్రీరంగమాహాత్మ్య గ్రంథములో తెలిపారు. దీనిని బట్టి వారి వద్ద కొన్ని ప్రాచీన - తెనుగు కావ్యములు ఉండి ఉండవచ్చును.

మలి ముద్రణలో సవరించవలసిన పట్టులు -

౧. తేళ్ళపూండి కసవరాజు పద్యంగా 'ఉపరతి వర్ణన' కందం ఒకకావ్యం లోనిది. పదప కల రెండు చంపకమాలలు 'కళావతీ శతకం' లోనివి. ప్రకాశకులు గుర్తించవలెను.

౨. బొడ్డపాటి కొండయ వ్రాసిన మూడు సీసములు 'చాటువులు' కావు. 'తిరుకాళహస్తి శతకము' (?) లోనివి కాబోలు 'అనుచు గొనియాడుదురు నిన్ను ననుదినంబు, నంగభవ భంగ తిరుకాళహస్తిలింగ' అనుమకుటమును ప్రకాశకులు గుర్తింప కుండుట చింత్యము.

౩. రావిపాటి త్రిపురాన్తకుడు వ్రాసినది 'చంద్రతారావళి'. అటులనే బొడ్డపాటి పేరియ పేరున ఉదాహరించబడిన రెండు సీసములు 'చాటువులు' కావు. 'మల్లికార్జున శతకము' లోనివి.

౪. నాగులూటి శేషనాథకవి ప్రణీత గ్రంథము 'శ్రీ పర్వత పురాణము.' మూడుసారులు ముద్రించబడినను, సుసంస్కృతి ముద్రణ లేమిచేత సాహిత్యలోకమున వ్యాపించలేదు చక్కని రచన.

౫. నూతన కవి సూరన కృత 'ధనాభిరామము' తెనుగులో తొలి స్వతంత్ర కావ్యము. మనోహర రచన. ఇది యు విమర్శకుల దృష్టికి అందకుండుట శోచనీయము.

౬. గ్రంథనామము, కర్తనామము తెలియరానివి అను శీర్షికలో లభించిన పద్యములలో చాలవాటికి కర్తనామములు తెలియుచున్నవి. మలిముద్రణలో వాటిని పరిహరించవలెను.

# స్త్రీల పాటలయందు అత్తాకోడళ్లు

- శ్రీమతి శిష్టా లక్ష్మీనరసమ్మ, ఎం. ఏ.

(గతసంచిక తరువాయి)

అత్త కోడలిని సాధించుట సర్వసాధారణము. అందులకై అత్త అనేక కారణములను వెదకుచుండును. వానిలో ముఖ్యమైనది ఆమె పుట్టింటి వారు తమను మరియాదగ చూచుటలేదనియు, అరణములు, కానుకలు తెచ్చుటలేదనియు చెప్పుచుండుట.

వేసవికాలం వచ్చె వలువల్లు చిరిగె
వనిత నీపుట్టింటివా రేలరారు?
మారుకాలం వచ్చె మడతలూ చిరిగె
మగువ నీపుట్టింటివా రేలరారు?

అని కోడలిని చీటికిమాటికి ఎత్తిపొడుచుచుండును.

కోడలిని గూర్చి అత్తగారికి కలుగు మరియొక తలంపు. కోడలు ఎంతపని చేసినను, ఇంటిలోనివారందరికిని అణుగులకు మడుగు లొత్తినను అత్తగారు కోడలేమియు పనిచేయలేదనియే ప్రచారము చేయును.

దంచక్క నలగవే ధాన్యరాసుల్లు
వంచకా వంగరే వనిత కోడళ్లు

---

ఆరయ జీవనం బమృతము ... అను పద్యము శ్రీనాథ కవిరాజు ఆంధ్రీకరించిన 'శాలివాహన సప్తశతి' లోనిది. 'అరయక మున్న — పద్యము ధ్వన్యాలోకములోని దిగువ శ్లోకమునకు తెనిగింపు.

లతాం పుష్పవతీం స్పృష్ట్వా
స్నాతో విమల వారిషు।
పునః స్పర్శన శంకీవ
మన్దం చలతి మారుతః॥

—o—

కోడలిని ఎంత ఎక్కువగ అణచిన అంతగ అణగిమణగి యుండునని అత్త అభిప్రాయము కావచ్చును. అత్తగారి అధికారము ఎక్కువైనకొలదియు కోడలి యందును తిరస్కారభావము వృద్ధిబొందుచుండును. ఎంత అణకువ గలిగిన కోడలైనను అత్తగారి తిరస్కారమును అనునిత్యమును భరియింపలేక ఎదురు తిరుగుచుండుట సర్వసాధారణము.

కోడలా కోడలా కొడుకు పెళ్ళామా
కొడుకు ఊళ్ళోలేడు మల్లెలెక్కడివి?

అని అత్తగారు అనుమానముతో ప్రశ్నించినయెడల కోడలు -

చెప్పి చెప్పించుకొను టెంతగొప్పతనము
అత్త నీవీపున వెలిమిడి అంటెనేమి ?

అని ఎదురు ప్రశ్నించును. దీనితో అత్త అప్పటికి మాటలాడకూరకుండినను సమయము వచ్చినపుడు మాత్రము కోడలిని దుయ్యబట్టును.

కాపురం జేసింది కల్లజేసింది
రెండేళ్ళలో ఇల్లు గుల్లచేసింది

అని కోడలిని 'ఖర్చు' మనిషిగా చిత్రించినది.

అత్తగారికి కోడలియందు తప్పులెన్నుటయే ప్రధానలక్ష్యము. ఆ లక్ష్యసాధనకై ఆమె కోడలి ప్రవర్తనను నిరంతరము పరిశీలించుచు తప్పు దొరకినయెడల ఆమెను దుయ్యబట్టుటకు యత్నించును.

అత్తింటికోడలవు కావుగావున్నే
ఆజ్ఞ సిగ్గులునీకు లేవుగావున్నే
వీపునిండ కొంగేది ఇరువరుసలేవె?
మడమ తిరుగుబట్టేది మాటవాసేది?

అత్తగారి సాధింపులను సహింపలేని కోడలు లోలోన కుములుచు-

అరటిపూసింది అరటి కాసింది
అత్తపెట్టిన అరళ్ళు మరపునకు రావు
ఆరళ్ళ అత్తయిన సవతిపోరైన
తల్లిల్లు దూరమైన భరియింపలేము
అని వ్యథజెందును.

ఆడవారిసేల కన్నావుతల్లీ
అడవులపాలేల చేసావుతల్లీ
కొడుకు పుట్టాడంటె కొండ లెక్కుదురు
కోడలొచ్చిందంటె రచ్చ నెక్కుదురు
ఆడదాన్ని నేనయి పుడితినిగాని
గండ్రగొడ్డలిక్రింద కొమ్మనైన మేలు
ఆడదానినయి పుట్టుటాకంటె
అడవిలో మానయిపుట్టుటే మేలు

అని తన జన్మను గూర్చి చింతించుచు నిట్టూర్పులను విడచుచుండును. కొంచెము ప్రౌఢయైన స్త్రీయైనచో తన భర్తను ఒప్పించి వేరింటికాపురమునకు యత్నములు చేయును.

కొన్నియెడల అత్తగారి అధికారము మితిమీరి కొడుకు వేతింటికాపురమునకు దారితీయును. కోడలి ఏబ్రాసితనమునకు అత్తగారు మందలించుటయు దానికా కోడలు కోపము తెచ్చుకొని వేరింటి కాపురము కావలయునని భర్తను ఒప్పించుటయు ఈ క్రింది పాట యందు కానగును

అత్తింటికోడలూ ఉత్తమురాలు
చేటలో చెయ్యెట్టి చేనిద్రబోవు
అంతలోన వచ్చింది ఆరళ్ల అత్తా
ఏతల్లి గన్నదే ఏబ్రాసి నిన్ను
వులికిపడి కోడలూ వుగ్గాన లేచి
రచ్చలో కూర్చున్న రాజేంద్రభోగి
మాయమ్మ వేరుండు లేచిరావయ్యా
అమ్మరో మాయమ్మ మముగన్నతల్లి
నీవు తెచ్చిన కోడల్ని ఏమిటన్నావు
పొద్దున్న పొరుగిళ్ళ వెళ్ళవద్దంది
నడుస్తూ తలకురులు విప్పవద్దంది
పొద్దోయి పొరుగిళ్ళ వెళ్ళవద్దంది

దీనియందు అత్తగారు చెప్పిన మాటలు సార్వజనీనములు, సార్వకాలికములు. వీనిని పాటించిన స్త్రీ ఉత్తమ యిల్లాలు కాగలదు. కాని ఈ సూక్తులను వినిన కోడలికి కోపముపెల్లుబికి భర్తతో వేరింటి కాపురమునకు యత్నములను చేయును.

చందమామకన్న సక్కని మొగుడా
వేరే పోదామా వేరే పోదామా
అత్తమామలపోరు నేను పడలేను
ఆడబిడ్డలపోరు అసలె పడలేను
ఉంగరాలచేయి ఊగరా మొగుడా
కందిరీగనడుము కదిలెరా మొగుడా
కొండంత కొప్పేమొ కదిలేర మొగుడా
కొప్పుపై జాజులు వాడెరా మొగుడా
అనియును,

చాయపసుపులాగ నను దెచ్చినావు
సరసుడా నీతల్లి సాధింపుచూడు
ముద్దపసుపులాగ నను దెచ్చినావు
ముద్దుడా నీతల్లి మూతిరుపు చూడు

అనుచు అత్తగారిపై కొండెములను చెప్పుచు వారి పోరు పడలేక వేరింటి కాపురమునకై భర్తను ఒప్పించుటకై శత విధముల యత్నించును. వేరింటి కాపురమువలన గలుగు లాభముల నన్నిటిని వివరించి చెప్పును. పై పాటల మూలమున అత్తింటికాపురము కత్తులబోను వంటిదని తెలియుచున్నది.

ఇక అత్తగారిపై కోడలి అభిప్రాయము లేవిధముగ నుండు నను విషయము ఈ పాటలయందు వివరింపబడినది.

అత్తవను శాంతంబు కత్తికి మెత్తన
కలదంటె యిలలోన కలికిరో వినమె

అను భావము స్త్రీహృదయము నందు గాఢముగ నాటుకొని యుండును. దీనికి కారణము స్త్రీవివాహమునకు పూర్వమే తన యింటియందును, ఇరుగుపొరుగుఇండ్ల యందును అత్తాకోడళ్ళ నడుమ జరుగు వాగ్వివాదములను, ఒకరిపైనొకరు చెప్పుకొను చాడీలను వినుట తటస్థించుచుండును. అత్తాకోడళ్ళ అనుబంధ మీవిధముగనే యుండు నను భావ మామె హృదయమునందు నిలిచిపోవుటచే తాను గూడ అదేవిధముగ ప్రవర్తించుట సంభవించును.

పుట్టింటి వునికియే పొలతికందంబు
అత్తమామలు చస్తే అతివ కందంబు

అనుమాట హేళనతో కూడినది. ఇది ద పుళ్ళపాట యందు పేర్కొనబడినది.

ఒకానొక పాటయందు అత్తగారు కోడలికి దాస్యము చేయుటయు, కోడలు తనకు నమస్కరించిన అత్తగారిని ఎత్తి పొడుచుచు దీవించుటయు కానగును.

చాలు చాల త్తయ్యా చాలత్తగారూ
నీకొడుకు వెయ్యేళ్ళ మొదలు కావాలీ
నీకోడలు పట్టంపురాణి కావాలీ
నువ్వేళ్ళి పంచల్ల పాలుకావాలీ

ఇచ్చట కోడలు అత్తగారిని ఈ విధముగ ఎత్తిపొడిచి హేళనచేయుటయందు అత్తగారి పెత్తనమునందు కోడలి అగచాట్లు కానగును. కోడలు అత్తగారి వలన ఎంతగ బాధావమానములకు గురియైనదో యన్పించును. తా నంతగ బాధ పడకపోయినచో అత్తగారి నంతచులకన గాఁజూడఁ బనిలేదు. అత్తగారి యెడ నామె మనసునం దంతద్వేషము కరడు గట్టినది. ఈద్వేషమే వారినంకను అవమానించుటకు దోహదము చేయుచున్నది.

మాయత్త మామామ ఊరేగుతుంటె
చుట్టమక్కలు రెండు చూడొచ్చినాయి
మట్టగిడసలు రెండు మాట్లాడినాయి
కందిరీగలు వచ్చి కత నడిపినాయి
మాయత్త మామామ ఊరేగినాక
వరిదంచ నొకమరిది వండ నొకమరిది
వంట కుండలకాడ కావ లొకమరది
పీడకల్లాపుజల్లు పెదబావగారు
ఇల్లలికి ముగ్గెట్టు యింటిమగవారు

అని వారినిగూర్చి హేళనగ మాటలాడినది. ఈవిధముగ అత్తగారిపై పెత్తనమును చలాయించు కోడండ్ర కన్నను కోడలిపై పెత్తనమును చలాయించు అత్తలే అధికముగా కలరు.

అత్తగారన్నదీ తా పెద్దమనిషి
కోడలికి దుడ్డెట్టి తా గడ్డి తినెను
గడ్డితిన్న అత్త గడ్డపాలాయె
దుడ్డుతిన్న కోడలు దున్నల్లెవుండె

అత్తమామలు చనిపోయినపుడు కోడలికి కలుగు దుఃఖముగూడ ఈ పాటల యందు వర్ణింబబడినది.

అత్తచస్తే కోడ లేమని యేడ్చు
అడవి తంగెడు పూచు ఆరళ్ళు మాను
మామచస్తే కోడ లేమనీ యేడ్చు
పోయికాడ చీద్రంబు పోయెనని యేడ్చు

అత్తాకోడళ్ళ పొత్తునుగూర్చి పెక్కు సామెతలు లోకవ్యవహారమునందున్నవి.

అత్తల మంచీ వేములతీపూ వుండదు
అత్త చచ్చినదని కోడ లేడ్చినట్లు
అత్త చేజారినది అటుగోటికుండ,
కోడలు చేజారినది సరికొత్తకుండ
అత్త చేసిన పనులకు ఆరళ్ళులేవు
అత్తా ఒకింటి కోడలే –

ప్రాచీనకాలమున అవిభక్త కుటుంబములయందు అత్తాకోడళ్ళ వాదులాట సర్వసాధారణము. కాని అర్వాచీనకాలమున అవిభక్తకుటుంబములే చాల తక్కువగ నున్నవి. ఈ కుటుంబముల యందును నేడు స్త్రీలు విద్యావతు లగుటచేతను, నాగరకతను జీర్ణించుకొనిన సంఘము నందలివా రగుటచేతను విషయము నవగాహన చేసికొని ప్రవర్తించుట సంభవించును. నేటికాలమున అత్తా కోడళ్ళ నడుమ పొత్తులేకపోయినను ఇరువురును బహిరంగముగ వాదించుకొనుటకు వెనుకంజ వేయుదురు. దీనికి కారణము నలుగురి యందును నగుబాటు కలుగు నను తలంపే. వాగ్వివాదములు ఎక్కువగా లేకపోయినను అత్తాకోడళ్ళనడుమ సన్నిహితత్వము మాత్రము లేదు. సాన్నిహిత్యము పెంచుకొనుట మిక్కిలి ఆవశ్యకము.

——•••——

# జాషువాగారు వర్ణించిన మన పండుగలు

– శ్రీ డా. జి. బి. ఎన్. ఆచార్య, ఎం ఏ., పిహెచ్.డి

పండుగలు జాతీయగౌరవాన్నందిన సంతోషదినాలు. జాతికి కలిగిన ఆపదలు తొలగటం, జాతికి కలిగిన అభ్యుదయం, లేక సత్పరిపాలనా సౌఖ్యాల జ్ఞాపకార్థం సంతోషంతో జాతి అంతటిచేగాని, కొంతఅయిన ఒక సంఘంచేగాని, ఏటేట ఆచరించబడే సంతోష దినాలే పండుగలు.

నిత్యమూ కష్టాల ఎడారిలో ప్రయాణం చేస్తున్న మానవుడికి సుఖాలు అప్పుడప్పుడు ఒయాసిస్సులా గోచరిస్తుంటాయి. ఆసమయమే మానవుడికి పండుగ అవుతుంది. ఒక జాతికూడా అనునిత్యమూ గడిపే యాతనాభరితమైన జీవితాన్ని మరచిపోయి, తాత్కాలికంగానైనా ఆనందాన్ని అనుభవించటానికి పండుగలు సృజింపబడ్డాయి.

క్రైస్తవ కవులైన జాషువాగారు హైందవ సంప్రదాయాలచే ఆకర్షించబడి, హిందూ పురాణాలను, అందలి ధర్మాలను, కావ్యాలను రచించారు. వారికి మన సంప్రదాయపుపండుగల అభిలాషకు అవి ప్రతీకలుగా నిలిచాయి.

మన ప్రాచీన – అర్వాచీన తెలుగు కవులు సంప్రదాయాభిజ్ఞతతో పండుగలను, పర్వదినాలను అతిరమణీయంగా తమ కవితల్లో వర్ణించారు. నేటికీ పలువురు కవులు దీపావళి, సంక్రాంతి, ఉగాది మొదలగు ప్రముఖ్యాలైన పండుగల్ని పద్య గేయ రూపాల్లో వర్ణించే ఆచారం మనం చూస్తూనే వున్నాం. ప్రస్తుత పరిస్థితుల్ని, కష్టసుఖాల్ని వాటితో అన్వయించుకొని కవిత్వాన్ని చెప్పటం నేటి సమకాలీన కవులకు పరిపాటి అయింది. ఈ ఒరవడిలోనే జాషువాగారు తమ మనోహర కవిత్వంలో హిందువుల పండుగలైన 'ఉగాది; సంక్రాంతి' పర్వదినాలను సహజసుందరంగా వర్ణించి, తమ సంప్రదాయాభిజ్ఞతను, సంప్రదాయాభిమానమును చాటుకున్నారు.

జాషువాగారు తమ ఏకవఖండకావ్యంలో 'ఉగాది' అను ఖండికను రసవత్తరంగా రచించారు.

'ఎనియెన్ పెక్కుయుగాదులీవరకు వి
శ్వక్షోణి బాలించి చి
క్కని దౌష్ట్యాంధ తమస్సులో వెలుగురే
కల్ దీర్పలేక విను
తన సంవత్సరదీధితుల్ కలుషితా
త్మల్ శుద్ధిగావించి పూ
యని చిత్తంబులకున్ వసంతబుతు మ
ర్యాదల్, ప్రసాదించుతన్.'

ఈ పద్యంలో కవిగారి ఆవేదన గోచరిస్తున్నది. చిక్కనిదౌష్ట్యాంధతమస్సులో వెలుగురేకలను సృజించలేక అశక్తాలై ఎన్నో ఉగాదులు గడిచాయి. కాని అలాగాక ఈనూతన సంవత్సరపుదీధితులు కలుషితాత్మలను శుద్ధిచేసి మోడుబారిన హృదయాలకు వాసంతవిలాసాన్ని కలిగించాలని కోరుకోవటం జాషువాగారి హృదయసంస్కారాన్ని, ఔన్నత్యాన్ని వెల్లడిస్తున్నది. ఈ శుభాశంసనలో జాషువాగారి విశ్వశ్రేయః కాంక్ష, లోకకల్యాణవాంఛ స్పష్టం చేయబడి కవికి, కవిత్వానికి పెద్దలు నిర్ణయించిన లక్షణాలు సలక్షణంగా సమకూర్చబడ్డాయి. సామాజిక స్పృహ కలిగిన కవిగా, అభ్యుదయవాదిగా జాషువాగారు ప్రశంసార్హులు.

'ఈ మనుజాళి నేలికొని
యేగిన ప్రాతయుగాదులందు సాం
గ్రామిక ఘోషలం గలుష
కార్య పిపాసలచేత తప్తమై

ధూమము జిమ్ము మాహృదయం
తోయజ పుష్పములందుగాదిరా
జ్ఞీమణి! శాంతి సౌఖ్యముల
నింపుము పెంపుము మానవత్వముల్.'

గడచిన ఉగాదులందు, కలుష కార్శ్య పిపాసల చేత తప్తమై మానవ హృదయాలు ధూమాన్ని చిమ్మాయి. అటువంటి కలుష హృదయాలందలి కలుషాన్ని తొలగించి శాంతి సౌఖ్యాల్ని, మానవతా భావాల్ని నిండింపవలసిందిగా ఉగాది రాజ్ఞీమణిని అభ్యర్థించారు ఈ అభ్యర్థనలో జాషువా గారికి గల శాంతి సౌఖ్యాలందలి అభిలాష, మానవతా ప్రియత్వం వ్యక్తీకరించబడ్డాయి. ప్రస్తుత వాతావరణంలోని దోషాల్ని సునిశితంగా విమర్శించి వాటిని తొలగించి, సద్గుణాల్ని ప్రవేశపెట్టాలనే కాంక్ష కవిగారిలో ప్రస్ఫుటంగా కనిపిస్తున్నది. కేవలం ఋతువర్ణన చేసి, శుష్క రచన చేయక, నూతన మార్గంలో సంఘానికి ఉపయోగించే విధంగా సందేశాలిస్తూ ఉగాది పండుగను అభివర్ణించిన జాషువా గారు అభ్యుదయకవి శేఖరులుగా అభినంద్యులు!!

జాషువా గారు తమ ఆరవ ఖండ కావ్యంలో 'సంక్రాంతి' అనే ఖండికలో సంక్రాంతి పండుగపై తమకు గల మక్కువను విశదీకరించారు.

మకర సంక్రాంతి పుష్యమాసంలో వచ్చే పండుగ. ఇది మనకు పెద్దపండుగ. శ్రీనాథుడు దీన్ని 'శివరాత్రి మాహాత్మ్యము'లో —

'ఇండ్ల మొదలను నీరెండ నీడికలను
ననాగ దమ్మాడు నన్నయూ నాటలాడు
అత్తలును కోడలును గుమ్మలాడుకుమ్ము
గాచుచోటికి మకరసంక్రాంతి వేళ'

అని ఎంతో రమ్యంగా వర్ణించాడు. ఆధునికులైన పింగళి – కాటూరి కవులు సంక్రాంతిని గురించి వర్ణిస్తూ –

'అన్ని పండువులందు ముఖ్యమిది గాన నత్తవారింటి కేగుమో క్రొత్త పెండ్లి కొమరుడా! అందు నీవు నెక్కుడు సుఖమ్ము' అని సంక్రాంతి పడుగ యొక్క ప్రాముఖ్యాన్నీ, సంరంభాన్నీ వర్ణించారు. ఇంకా ఆధునికుల్లో రాయప్రోలు, తుమ్మల, నాయని, నారాయణరెడ్డి మొదలైన వారంతా సంక్రాంతి పండుగను గూర్చి సరస కవితల్ని సహృదయులకు సమర్పించారు.

సంక్రాంతిని గూర్చి అద్భుతమైన భావనా బలంతో, సహజ సుందర వర్ణన కౌశలంతో పద్యాలు చెప్పిన కవుల్లో నవయుగ కవిచక్రవర్తులైన జాషువా గారు అగ్రగణ్యులు. వీరిదృష్టిలో ఈ పండుగ 'పర్వరాజ్ఞీమణి' 'సర్వరాజేశ్వరి.' నిజానికి ఈ పండుగే సంవత్సరాది పండుగ. ఎందుకంటే పంటలు పండి జీవితంలో క్రొత్త మార్పు కలుగుతుంది. అప్పటినుంచి చలి తొలగటం ప్రారంభమై, ఆకులు రాలి నూతన సృష్టి మొదలవుతుంది. సృష్టికి విమోచనదిన మది. కనుకనే 'సంక్రాంతికి సంకెళ్ళలో ఉన్నవారికి కూడ విముక్తి' అనే సామెత ఏర్పడింది. ప్రకృతి కళకళలాడుతూ కనుల పండువుగా వుంటుంది. కోతకు సిద్ధంగావున్న వరి చేలు, విరబూసిన చేమంతి, బంతి, గుమ్మడి పూలు ప్రకృతి మాత పసుపుపచ్చని చీర ధరించినదనే వూహ కలిగిస్తాయి. దేశానికి సౌఖ్యశ్రీ కలిగించిన శుభసంక్రాంతి ఇది. అని కవిగారి అభివర్ణన. సంక్రాంతికి ముందే వర్షాకాలం అంతరిస్తుంది. అందుచేత సరస్సులన్నీ కలతదేరి పరిశుభ్రంగా వుంటాయి ఈ శుభసుందర వాతావరణాన్ని దృష్టిలో వుంచుకొని జాషువా గారు–

'నీళ్ళు మోసి మోసి నింగిని మేఘముల్
పర్వతాలి శయ్య పవ్వళించె
కలత తెల్ల బాసి కొలకులు పరిశుభ్ర
జలయుతంబులై ప్రశాంతి నలరె!'

అని వర్ణించారు.

కర్షకులు భూమాతను నమ్మి, అత్యధిక శ్రమతో కృషి చేసి, పొలాలలోని పైరులన్నిటినీ కోసి, ధాన్యాన్ని ఇంటికి చేర్చుకునే శుభసమయమే సంక్రాంతి పండుగ సమయం. ఈ పంటలు రైతుల గృహాల్ని చేరటాన్ని కవిగారీవిధంగా వర్ణించారు.

'కర్షకాళి బాహుకష్టంబు ఋణమీగి
క్షేత్రరాజి నిద్ర జెందసాగ
కాడిమాని బరువుగడచి పోవగ నెడ్లు
హాయిమీర నెమరు వేయుచుండె.'

రైతుగావించిన సేవకు ప్రతిఫలంగా భూమాత ధాన్యరాశుల నిచ్చి బదులు తీర్చుకొనినది. కృతజ్ఞతను చూపినది. కాని నరులు కృతఘ్నులు. చేసిన మేలు మరవటం వీరికి సహజసిద్ధమైన గుణం. నరులరాతిమనస్సులలో కృతజ్ఞతా బీజాలను నాటి, ప్రశాంతి ఫలాలను పండించవలసిందని సంక్రాంతి సుందరిని ప్రార్థించారు.

'వచ్చున్ సంకురుమయ్య భూతలికి నీ
బంగారు తేరెక్కి మీ
కిచ్చున్ మేళ్ళని శాస్త్రముల్ బలుకు, నే
దెట్లైన నీరాక చే
పచ్చంబడ్డవి మాకునోజ్జములు సం
ప్రాప్తించె నీ సత్కటా
క్షోచ్చచ్ఛాయల నన్నవస్త్రములు మా
కో పర్వరాజేశ్వరీ !''

అని, సంక్రాంతి పర్వదినం మేళ్ళను ప్రసాదించటాన్ని సంభావించారు. (*'సంకురుమయ్య' శబ్దం నిఘంటువుల్లో కనిపించటం లేదు. జాషువా గారు ఎక్కడనుండి గ్రహించారో.

'మానవులకే కాదు మహినెల్ల సృష్టికి
తలప నీవు రాక సెలవురోజు

ప్రణతులమ్మ సంకరాత్రి యింటింట
నడుమ మోపి విందు గుడిచిపొమ్మ.'

ఈ పండుగ హిందువులకే ముఖ్యమైనది. అందులోనూ కొన్ని ప్రాంతాలవారికే అతి ప్రధానమైనది కాని జాషువా గారు అత్యుక్తితో విశ్వవ్యాప్తమైన పర్వదిన మని భావించారు. ఇది, వారికి ఈ పండుగపై గల అత్యంతాభిమానానికి నిదర్శనం.

ఆధునిక కాలంలో జాతీయాభిమానం ప్రజాస్వామ్యంలో వెల్లివిరిసింది. జాతీయాభిమానంతో కవిత రచించే కవి, ఆ జాతి ఆచరించే పండుగ పబ్బాలనుగురించి కూడా ప్రస్తావించడం ప్రారంభించాడు. ప్రసిద్ధులైన కొందరు తెలుగు కవులు తమ తమ ఆనందోత్సాహాలను, విచారవేదనలను వ్యక్తీకరించారు. ఆధునికులైన జాషువా గారుకూడా తమ ఉత్సాహాతిశయాన్ని, ఆవేదనాపూర్వకనివేదననీ వెల్లడించి, మన పండుగులనుగూర్చి కవిత్వాన్ని చెప్పి, తమసంప్రదాయాభిలాషను విలక్షణమైన రీతిలో వ్యక్తీకరించారు. మనపండుగలను గూర్చిన ఈ రెండుఖండికలు రసపిపాసువుల రసనాగ్రములకు రుచ్యములైన కవితా రసమయగుళికలు! విశ్వజనాళిని వినూత్న పథంవైపు నడిపించే మానవతా మణిమయదీపికలు!!

—•••—



# ధర్మన భావనాశక్తి

– కుమారి డి. అన్నపూర్ణ, ఎం. ఏ.

భావన కవిమానసిక దృష్టికి గోచరించు నట్టిది. సాధారణ మానవులకు సామాన్యమైనదిగా కన్పించు వస్తువు ప్రతి భావంతుడైన కవి భావనలో అపూర్వ వస్తువుగా కొనియాడ బడి మనోజ్ఞమై సహృదయుల కానందమును కలుగఁ జేయును. కవిశక్తిని అంచనా వేయుట కుపకరించు సాధనములలో ఈ భావన ఒకటి. దీనిని గురించి ప్రాచీన లాక్షణికులు ఏమి నిర్వచించిరో పరిశీలింప వలసి యున్నది.

'నైసర్గికీ చ ప్రతిభా
శ్రుతం చ బహునిర్మలమ్
అమంద శ్చాభి యోగోఽస్యాః
కారణం కావ్య సంపదః
(కావ్యా. 1.103)

అని దండికావ్యహేతువులనువివరించెను. 'సహజ సిద్ధమైన ప్రతిభ బహుముఖమైన శాస్త్ర జ్ఞానము, గట్టి కార్యదీక్ష అను మూడును కలిసి కావ్య నిర్మాణమునకు కారణమగునని' ఇతడిఅభిప్రాయము–

'శక్తి ర్నిపుణతా లోక
శాస్త్ర కావ్యాద్యవేక్షణాత్
కావ్యజ్ఞ శిక్షయాఽభ్యాస
ఇతిహేతు స్తదుద్భవే.'
(కావ్యప్రకాశము 1–3)

అని మమ్మటుడును శక్తి (ప్రతిభ) వ్యుత్పత్తి, అభ్యాసములను కావ్యహేతువులనుగా పేర్కొనెను.

ఈమూడింటిలో ప్రతిభను 'ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా' అని భట్ట కేతుడును, 'ప్రతిభా అపూర్వ వస్తు నిర్మాణక్షమా ప్రజ్ఞా' అని అభినవగుప్తుడును నిర్వచించియున్నారు. ఎప్పటి కప్పుడు సరి క్రొత్తగా భాసిల్లుచు, కావ్య నిర్మాణమున దక్షమైన ప్రజ్ఞయే ప్రతిభ యనబడును. ఇక రాజశేఖరుడు 'సా (శక్తిః) కేవలం కావ్యహేతు రితి' యని ప్రతిభ యొక్కటే కావ్య హేతువుగా వచించియున్నాడు.

ఈ ప్రతిభనే ఆధునికులు భావశక్తి అనిపిలిచిరి. దీనిని ఆంగ్లములో **Power of imagination** అని వ్యవహరింతురు. లోకములో జుగుప్సాకర వస్తువులు కూడ కవితలో చేరి రమణీయమై ఆస్వాద్య మగుట యీ ప్రతిభా మాహాత్మ్యము వలననే. ప్రతిభ ఇంత ప్రధానమైనది. కావుననే 'ప్రతిభైవ చ కవీనాం కావ్య కరణ కారణమ్, వ్యుత్పత్త్యభ్యాసౌ చ తస్యా ఏవ సంస్కార కారకౌ న చ కావ్యహేతూ' (శృంగార తిలకము).

–ప్రతిభయే కవులకు కావ్యహేతువు. వ్యుత్పత్త్యభ్యాసములా ప్రతిభకు శోభాతిశయమును గూర్చునవియే కాని యవి కావ్యహేతువులు కావు అని వాగ్భటుడును. 'తస్య చ కారణం కవిగతా కేవలా ప్రతిభా '(రస. గం) – కావ్య రామణీయకమునకు – కవికి కల ప్రతిభ యొక్కటియే కారణము అని జగన్నాథ పండితుడును బల పరచిరి.

కవికి ప్రతిభ ప్రధానమైనది. ఇది అతనికి పూర్వజన్మ సంస్కారము వలన లభించినట్టి వరము. మనకి సాధారణముగా కన్పించు వస్తువులు ఒక్కొక్క కవికి ఒక్కొక్కవిధముగా గోచర మగుచుండును. వారికి గోచరమగు తీరునుబట్టి వారి సంస్కారము, లోకజ్ఞానము తెలియ నగును.

భావనలు వర్ణనలందు ఎక్కువగా వెలికి వచ్చును. అసలు వర్ణన కవి భావనకు సంబంధించినదే కదా! చిత్రభారతము నందలి కొన్ని వర్ణనలలో ధర్మన యొక్క భావనా చాతుర్యమును చూద్దాము.

సగపాలు సాంధ్య రాగము
నిగిడినఁ గెంజాయఁ దనరి నెఱచీ కటిచే
సగపాలు నలుపు నొందుచు
గగనము గురివెంద గింజ కైవడి బొల్చెన్.
6_107.

ఇది ఆకాశ వర్ణన. సగభాగము సాంధ్యరాగముతోను, సగ భాగము నలుపు తోను కూడి గగనము గురివింద గింజ వలె చెలువొందినది. భావన చక్కగా నున్నది. ఈ గగనము శ్రీనాథునవ నీలపు టద్దమువలె, పోతనవ అరణ్యము వలె, రామభద్రున కంబురాశి వలె, హంస వింశతి కారునవ నడబావి వలె కన్పట్టినది.

ఇక నక్షత్ర వర్ణన.

చలి వెలుంగుఱ తేడు రే చామ నిపుడు
పెండ్లి యాడెడు నంచు సంప్రీతి వేల్పు
ముద్దియలు వెట్టు ముత్యాల ముగ్గుల నఁగ
గ గ న తలమున నిండి చుక్కలు వెలింగె.
6_108.

చంద్రుడు రజని అను స్త్రీని పెండ్లాడు నపుడు దేవతా స్త్రీలు వేడుకతో పెట్టిన ముత్యాల ముగ్గు అను నట్లుగా ఆకాశమున నిండి చుక్కలు ప్రకాశించిన వట.

పదముల చొప్పును వడియొ
ప్పిదము నలంకార లక్ష్మి పేర్మియు, ధారా
స్పద భావము గల్గి శుభ
ప్రదమై హయ మమరె సత్ప్రబంధము రీతిన్. 3_160.

ధర్మన హయమును సత్ప్రబంధముతో నుపమించినాడు. పదముల చొప్పు, వడి (వేగము) ఒప్పిదము; అలంకారలక్ష్మి పేర్మియు (ఆభరణముల సమృద్ధి) ధారాస్పదభావము (అశ్వగతి) కలిగి ప్రబంధము వలె హయ మున్న దట.

ఎలమి మేలైన వర్షంబు లెల్ల జాఱ
స్వాంతమున 'దూలి' గద్గద స్వరముగ దుర
తుది శరత్తులఁబో దివి వృద్ధుల విధమున
నరిగె నెండేని మేఘంబు లాకసమున.
2_28.

శరత్ ఋతు వర్ణన సందర్భమున ఆకాశము నందు మేఘములు వెళ్ళుటను వృద్ధులతో పోల్చినాడు. మేలైన సంవత్సరములు గడచిపోగా స్వాంతమునఁ దూలి, గద్గద స్వరము గదుర, తుది సంవత్సరములు వచ్చిన వృద్ధుల వలె మేఘము లున్నట. పోలిక సహజ చమత్కారియై యున్నది.

కరకమలము లానన పం
కరుహంబులు నేత్రపద్మగణమున్ బాదాం
బు రుహంబులుఁ జొప్పడ నా
తరుణులు పద్మినులె యనుట తథ్యం బయ్యెన్. 3_15.

రంభ, ఆమె చెలికత్తెలు జలకమాడు సందర్భమున కవి ఈవిధముగా చెప్పెను. వారి కరములు కమలములతోను, ఆననములు పంకరుహములతోను, నేత్రములు పద్మములతోను, పాదములు అంబురుహములతోను పోలిక కల్గి యుండుట వలన (అన్నీ పద్మసామ్యములే యగుట వలన) ఆ స్త్రీలు పద్మినులే యనుట తథ్య మని చమత్కరించినాడు. సాధారణముగా కవులు స్త్రీల కరములను, ఆననములను, నేత్రములను, పాదములను పద్మములతో నుపమించుచుండుట సహజము. దాని నే గ్రహించి ధర్మన యీవిధముగా చమత్కరించినాడు.

తన సొమ్ములై యున్న ఘన తర పద్మరా
గ ప్రభాపటలి నల్గడలఁ బర్వఁ
దన జీవన స్థితి మనియెద నని రాజ
హంస మండలము నెయ్యమునఁ గొల్వ
దన నిత్య మధురత్వమునకుఁ దక్కినవారిఁ
జౌక సేయుచుఁ గవీశ్వరులు పొగడఁ
దనవ నీడై సంతతంబును వికసించి
పుండరీకంబులు దండి మెఱయఁ

దన్నుఁ బాయని సిరిఁ జూచి తలఁ గలేక
వేడ్కఁ బ్రమదాళు లెల్ల సేవించుచుండ
సరసులవ నెల్ల మేటియై సార్వభౌము
చందమున నుల్ల సిల్లి యాసరసి మెఱసె.
3_3.

ఇట ధర్మన సరస్సును సార్వభౌముని తో పోల్చెను. సరసు పరముగా అర్థము :_ తన అధీనములైన తామరల కెంపు యొక్క కాంతి నలుదెసలా వ్యాపింపగా; తన నీటియందు బ్రతికెద మని రాజహంసలు ప్రేమతో కొలువగా; తన నిత్య మధురత్వమును తక్కిన సరసులందలి నీటిని కించపరుచుచు నీటి కాకులు పొగడగా, నిత్యము వికసించిన తెల్లతామరలు మెఱయగా; తన్ను విడువని సౌభాగ్యమును చూచి వెళ్ళలేక సంతోషముతో ప్రమదాళులు సేవించు చుండగా; సరసులవ సార్వభౌమునివలె ఉల్లసిల్లి యీ సరసు ప్రకాశించిన దని భావము.

సార్వ భౌముని పరముగా భావము :_ పద్మరాగ మణులతో కూడిన ఆభరణముల కాంతి నాలుగు దిక్కుల ప్రకాశించగా, తన ప్రాపున బ్రతికెద మని రాజులు ప్రేమతో కొలువగా; తన నిత్య మధురత్వమునవ తక్కిన రాజులను చౌక చేయుచు కవీశ్వరులు పొగడగా, తన రాజ్యమున ఏనుగుల సమూహము అధిగమించగా, తన్నుఁబాయని సంపదఁజూచి తలగలేక సంతసమున ప్రమదాళులు సేవించగా సరసులవ (రసికులవ) నెల్ల మేటియై సార్వ భౌముడొప్పెను.

ఇట సరసును సార్వభౌమునితో నుపమించి చక్కని వర్ణనను చేసాడు ధర్మన.

7) పరమ 'హంస' యనంగ దా బరగి
'యమృత'
దేహియై 'మంగ'ళాకృతిఁ దేరి 'బుధత'
జెంది విజ్ఞాన 'గురుఁడు' నా జెలఁగి
యతఁడు
పర్వత 'భృగు' స్థలమునఁ దపంబు పలిపె.
2-64.

ఇది తుల్యముని వర్ణన. ఉత్తమ పదము నొందిన సన్న్యాసి యను నట్లుగ ప్రవర్తిల్లి, అమృతదేహియై మంగళాకృతి కలిగి, విద్వాంసుడై, బృహస్పతి వలె శోభించి అతడు పర్వతపుచరియ యందు తపము చేయ చుండెను. ఇందు గల కొన్ని పదములలో ఆది, సోమ, మంగళ, బుధ, గురు, శుక్ర, అని వారముల నామములు వరుసక్రమమున వచ్చుట విశేషము.

హంసుడు సూర్యుడు = ఆదిత్యవారము = ఆదివారము, అమృత దేహుడు = సోముడు సోమవారము, మంగళ = మంగళవారము బుధత = బుధవారము, గురుడు = గురువారము, భృగు = భృగువారము = శుక్రవారము.

8) ఈ కుసుమ గుచ్ఛ మతి భృం
గాకీర్ణం బగుచు నొప్పె నతివా, చూడన్.
రాకాంతింబున గ్రహణ
వ్యాకలితశశాంక బింబమని పోల్పంగన్.
2-145.

తుమ్మెదలతో కూడి యున్న కుసుమ గుచ్ఛమును, గ్రహణకాలమునాటి చంద్ర బింబముతో పోల్చినాడు ధర్మన. ఇట శశాంక బింబము కుసుమ గుచ్ఛముతోను, రాహువుచే ఆక్రమింపబడు టనునది తుమ్మెదలతో కూడుకొనుటగాను నుపమింపబడినది.

ధర్మన ప్రతిభతో చిత్ర భారత మొక సత్ప్రబంధమై అలారిన దని చెప్ప వచ్చును.

—o—

# నా అవధాన కవిత

– శ్రీ చిలుకూరి రామభద్రశాస్త్రి

1945 జనవరి ఒకటవ తేదీని ఆర్యాపురం సంస్కృతపాఠశాలా ప్రధానోపాధ్యాయ పదవికి తిలోదకా లిచ్చాను. అందుచేత అవధానాల సభలద్వారా ఆర్జించడము తప్పని సరియైంది. ఆ తిరగడంలో జటప్రోలు మొదలైన కొన్ని సంస్థానాలలోను పండిత సభల్లోను ఎన్నైన అవధానాలు చేయడం నాంతరీయకమైంది. కవితాభారతితో పాటుగా జయలక్ష్మికూడా సభల్లో నన్నాదుకుంటూనే వుండేది.

ప్రకృతంలో జటప్రోలు సంస్థానావధానంలో యావజ్జీవం నా గుండెలలో మసలుతూ వుండేవా రిద్దరే.

ఎవరు ? ఎందుచేత నంటారా ?

1. శ్రీ మిడుమావరపు రామకృష్ణరావు గారు– ఈయన ఆస్థానంలో ఆ రాజావారి అంతరంగిక కార్యదర్శి. బి ఎ. ప్యాసైనాడు. అంతేకాదు విశేషణాలు! స్వయంగా రామకృష్ణాకుల చిత్రాలు వ్రాసి తన యింటినలంకరించినభక్తశిల్పి. అంతేనా ? స్వయంగా ధారాళంగా పద్యాలు వ్రాయగల కవనశక్తుడు, పైగా పండితసాహాయ్యకుఁడు.

తనయింట నాకు భోజన - వసతులను కల్పించి ఆరాజావారితో మనవిచేసి అవధానాని కేర్పాటు చేయించి నూట పదార్ల సమ్మానం చేయించారు. ఈయన బాకీ తీర్చడం కష్టమనయ్యేవే కృతజ్ఞతాభివందనా లర్పిస్తూ వుంటాను.

ఇక రెండవవారు

సదరు సంస్థాన వైయాకరణి కరిపల్లె పాఠశాలలో పనిచేయుకాలంలో మా తండ్రి వరదయ్య శాస్త్రి గారి వద్ద వ్యాకరణశాస్త్రాభ్యాసం చేశారట. ఈయన స్వయంగా చెపితేనే విన్నాను. ఈ యన మాత్రం నిషిద్ధాక్షరిలో నన్ను సాగదీసి పడకొట్టడాని కబద్ధాలు కూడా ఆడి ఫలితంగా శ్రీ రాజావారి - రామకృష్ణరావు గారి పరాభవానికూడా పాత్రుడైనాడు. అయితే అయినాడు గాని అవధానాలలో గండరగండ, అనే పేరు నాకు తెప్పించాడు. అంతేనా, ఎందరు పండితులున్నా లెక్క లేదన్నంత గౌరవాన్ని కూడా నాకు కలిగించాడు. కాబట్టియే ఈయన నామనస్సులో కొంతస్థలా న్నాక్రమించాడు. వ్యయశ్రావణంలో జరిగిన అవధానంలో ఇచ్చిన సమస్య– శ్రీ వాజపేయాజుల రామసుబ్బారాయడు; బి. ఎ. ఎల్. టి. (కొవ్వూరు) గారిది.

శ్రీఘ్రము గాను చెప్పవలెనది

చేయుచునుందురు లోకమందు సత్
వ్యాఘ్రమువోలె పౌరుషపు
వాక్యములాడుచు నుందు రక్కటా !
వ్యాఘ్రమని బోలు నీ కుటిల
భావము మానసమందు మాను వుం
వ్యాఘ్రమువంటి వారు మగ
వా, తగవా? మగవారి నమ్ముటల్.

2. నిషిద్ధాక్షరి ఆస్థాన వైయాకరణి! భావము–ఒక యర్ధరాత్రివేళ సర్వాభరణ భూషితగాత్రియైన యువిద యొకతె అడవిలోఁ బోవుచుండగా దొంగ లామెనగలన్నింటిని హరించినారు కాని నాసామణిని మాత్రము విడిచినారు – కారణమేమి? (సంస్కృతమున)

'అరణ్య భాగేతు నిశీథకాలే
త్వలంకృస్త్రాభరణాని దృష్ట్వా
చోరా శ్చచోర శ్చ విసృజ్య నాసా
మణిం జగుః – పావన బుద్ధి హేతుః'

3. దత్తపది - ఆస్థాన సిద్ధాంతి.
1 అక్షయ్యము 2 వక్షోజము 3 పక్షము
4 నక్షత్రము.

ఖండితనాయికా స్వభావ వర్ణన -

అక్షయ్యంబగు ప్రేమరాశిని స్వకీ
యాలంకృతుల్ గప్పినన్
వక్షోజంబులు మ్రొత మూర కబుగన్
బ్రాల్మాలు నానాథుతో
బక్షంబందుచు దూతి పొమ్మనగ
నాపక్షీంద్రుడే పోయె ఆ
నక్షత్రం బట నేమి సేయుటకు
గానన్ లేక యేడ్చెన్గదా!

4. న్యస్తాక్షరి. క్షుద్ర క్షత్రియ పక్ష
శిక్షణ విధిన్ - ప్రోక్షిప్త కాక్షేయకం బై.

5. అప్రస్తుత ప్రసంగం - శ్రీ వికటకవి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు (చిత్తూరు) శ్రీ రామకృష్ణ రావుగారిపై చెప్పిన పద్యాలలో నొకటి మాత్రం గుర్తున్నది.

చక్కని చిత్రలేఖకుడు
సాఫుగ బద్దెము లల్లగల్గు వాఁ
డె క్కవి గాయకాదులకు
వృద్ధి కరుండగు చంద్రముండు ! ఏ
టెక్కు లేని కృష్ణపద
తీవ్రపు భక్తుడు రామకృష్ణ రా
వెక్కుడు నాకు గూర్చి నిక
హెచ్చుగ గృష్ణుడె బ్రోచు నీతనిన్

శ్రీ రాజా వేంకటజగన్నాథరావు జమీందారువారిపై ఆశువులో జెప్పిన కొన్ని.

వేంకటేశో జగన్నాథః
పాయాత్ శ్రీ వేంకటాఖ్యగమ్
జటప్రోలు విభుం సద్యః
జగన్నాథ నృపం సదా.
యం భూపతింద్రష్టు మహాంగతోవా
పద్యస్య చాఽర్థం పఠనంచ కుర్యాత్
అత్ర త్వద్దృష్టా స్మమ పద్య పాఠః
నాఽర్థోఽక్తి రిత్యస్మి విధూత కష్టః -

'అల హారీతసగోత్ర జాతుఁడ, జయుం
బైకట్టి సద్వంశజా
తలసత్కీర్తి విభూషింతుడ; ధర తా
తల్ వారి ముత్తాతలా ?
ఇల సచ్ఛాస్త్ర లసచ్ఛిరోమణులు త
ద్వంద్వా లసద్బుద్ధినై
అలఘుస్వాంతుని నిన్ను గాంచ శ్రమతో
నర్థార్థినై వచ్చితిన్.'

'భూపా! రాజుల దర్శనం బిడు శుభం
బుల్ స్వర్ణ మాణిక్యముల్
ప్రాపౌరీతి నటంచు వచ్చితిని-మ
త్ప్రాప్తంబుగా నీక నా
తాపం బంతయుఁదీర్చి వేగవిధి ప్రా
తన్ ద్రిప్పి యానైషధున్
లోపం బెంచగ నీ కశక్య మది, ఆ
లోచింపు భూపాలకా'

నూటపదారుల సన్మానం జరిగినది తిరిగి వస్తూ దారిలోఁ జెప్పిపంపిన పద్యాలు.

'ఇంతమాత్రంబు గవి గౌరవింత మనుచు
అవని గానంగరారు - పేరాస తగదు
దాచఁబెట్టితినా? రాజు దగ్గరేమి?
ప్రాప్తమే వచ్చుననుపల్కుఁ బల్కు
గాదె ?'

'బుగ్గను వ్రేలు పెట్టుకొను
బోగపు దానికి వేల నిత్తురే ?
తగ్గక డాబులే పలుకు
దాసుల కిత్తురు వేయినూరు లే
పగ్గయులేని నాటకుల
బ్రహ్మరథంబునె పట్టుచుందు రాఁ
దగ్గ కవీంద్రుకే యిడఁగ
దప్పగఁ జూచెద రెల్లవారలున్'

తరువాత చేసిన అవధాన పద్యాలు నా అశ్రద్ధవలన చాలాభాగం పోయాయి! జ్ఞాపకమున్నవే కొన్ని యవధానాలూ సమస్యా పూర్తులు చాటువులూ మచ్చు చూపుతాను.

2. 9-1-1957 వ నాడు భద్రాచలం దేవస్థానంలోని చిత్రకూటంలో దేవాలయాధికారులు శ్రీ కొండపల్లి రామచంద్రరావుగారి ఆధ్యక్ష్యంలో జరిగిన అవధానంలో ప్రార్థన -

'శ్రీరామం కరుణాకరం మునిజనా
భీష్టప్రదం శాశ్వతం
లోకారాధ్య మునీంద్ర వందితపదం
భక్త ప్రియం భావయే
విశ్వామిత్ర మహర్షి యాగసమయే
సంపూర్ణ సాహాయ్యదం
వందేఽస్మిన్నవధాన కార్యసమయే
మద్రక్షకం రాఘవమ్.'

'నమామి పార్వతీ సూనుం
భక్తానామార్తి నాశనమ్.
లోకారాధ్య పదద్వంద్వం
విఘ్నరాజం వినాయకమ్.'

'అమ్మ! వాగ్దేవి! నిన్గొల్తు నహరహంబు
కష్ట మష్టవధాన సత్కార్యమనుచు
నెఱిగియుండియు నీయూత నెఱిగిచేయ
సిద్ధపడినాను రక్షించి యుద్ధరింపు.'

'చెళ్ళపిళ్ళ కులోద్భూతం
వేంకటేశకవీశ్వరమ్
లక్ష్మీనారాయణం శాబ్దిం
నమామ్యద్య గురుద్వయమ్'

సమస్య. పోపూరి నరసింహం గారు, హైస్కూలు తెలుగుపండితులు.

'పతి వియోగము నందని పడతి మనసు
లక్ష్మికిం బ్రియవాహన రాజమేది?
కలువ లెవ్వని రాక వేఁ గాంతిఁజెందు
వికసనం బందుఁ బద్మ మవ్విధునిరాక'

దత్తపది. సభాధ్యక్షులు శ్రీ రామచంద్రరావుగారు. భద్రగిరీంద్రుని వర్ణన-
గోగు - నార - తాడు - గోడు.

'గోగునారైన మొలువని కుధరమునకు
ద్రాడుతోఁ గట్టినట్లు నిదాన సరణి
గోడు లెంచక తైర్థికకులము వేగ
నడచివచ్చెను, బంధముల్ సడలఁజేయ'

నిషిద్ధాక్షరి - గజానన వర్ణన.
శ్రీ ముదిగొండ పిచ్చయ్యశాస్త్రి గారు
(విజయవాడ)

'పాయాద్వో గజవక్త్రోऽసౌ
భక్త దత్త సువిస్తరః
శాణపంగ్వంధ దీనానాం
రక్షకో విఘ్ననాయకః'

న్యస్తాక్షరి. శ్రీ వి.మందేశ్వరశర్మగారు, టీచరు, హైస్కూలు. పావమముగారి
పనిసారి సరిసరి సరియే హరియే గిరియే.
ఆ సంవత్సరం ముక్కోటినాటి రాత్రి స్వామివారి యూరేగింపును గూర్చి -

'బహూహూ! యేమి మహత్తు రాముని ద
  యోగ్యల్ జూడలేరే కదా!
బహు జన్మార్జిత పుణ్యసంచయము మ
  ద్భాగ్యాన భద్రాద్రిపై
నివాసుండే ఫలియించి రామునిగ న
  న్నీరితి సాపడ్డదే;
అహహా! నాకిక మోక్ష మబ్బునని
  భక్త్యావేశత న్బల్కెదన్.'

'స్వామీ! రామ! కళత్రసోదరుల శ
  శ్వత్సాధులన్ వీథిలో
నే ముందు న్నిలబెట్టి ద్వారమున నీ
  వే నిల్చి యూరేగెదే
వా! మమ్ము న్గరుణింపు మంచనెడి మా
  ప్రార్థింపు లాలింపు మా
రాముం డీవె! అయోధ్యలోని జను లౌ
  రా! మే మటంచెంచెదన్.'

దిగజారుదుస్తుల ఖగపతిపై నెక్కి
  యూరేగుచుంటి వనూహ్య చరిత!
తొడపైన సీతను దొలగించి ముందుంచి
  యెక్కడ వూరేగు టొప్పునయ్య!
ద్వారమందున విప్రవాహిత పల్లకి
  పైన నూరేగదో భద్రమూర్తి!
భవవార్ధి దాటించి భక్తరక్షణ సేయు
  ప్రతియేటి పనిగదా! భక్తపోష!
రాముడే యై శంఖచక్రా లేడ?
ఊంభాగాన జానకి యుండదేమి ?
గరుడుడేమయ్యె? మదిలోన గలత
  బడితి.
అంత నెఱిగెద నీక థావళుల దెలిసి.

3. 14-8-1957 వ తేదిని కొవ్వూరు. ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠ కళాశాలలో జేసిన అవధానము. కళాశాల ప్రిన్సిపాలు శ్రీ కె వి ఎన్. అప్పారావుగారి కోరికపై ప్రార్థనాశ్లోకపు దెలుగుసేత.

'లక్ష్మీం తనోతు నితరామిత రానపేక్ష
మంఘ్రిద్వయం నిగమశాఖిశిఖాప్రవాళమ్
హైరంబ మంబురుహ డంబర
  చౌర్యనిఘ్నం
విఘ్నాద్రి భేదశతధార ధురంధరం నః.
భోజుని రామాయణ చంపుట తెలుగింపు.
నిగమశాఖుల జిగురాకు - నీరజాత
కాంతి గర్వ ప్రణాశ విఘ్నాద్రి భేద
వ్రజ శత్రువు నితరానపేక్షమైన
గజముఖపదంబు లచ్చిని గలుగజేయు'

'వేంకటా ద్ర్యప్పరా డ్విబుధుడు
  ప్రిన్సిపాల్
  చల్లనిపాలన సలుపుచుండ
చిలుకూరి రామమూ ర్త్యలఘుసత్కీర్తి తా
  శాబ్దము సర్వత్ర జల్లుచుండ
ఇతరపండితవర్యు లెంతయో శక్తితో
  పాఠప్రవచనాల ప్రభలనీన
గ్రామస్థులైనట్టి ఘనలౌక్యులే భక్తి
  నధికార సభ్యులై యలరు చుండ
శాబ్ది మాతంగివరదయ్య శాస్త్రిగారు
బాల్యమున నిన్ను సేవించి పరగియుండ
పరమ కొవ్వూరుగీర్వాణ పాఠశాల!
శ్రీగణేశుని కరుణతో జెలగుమమ్మ!'

సమస్య - సభాధ్యక్షులు-శ్రీ అప్పారావుగారు.

'భువిలో నెప్పటి కెద్దియో
వివరింపగ శక్యమౌనె? విధికిని గానీ!
భువిపతి సభలో వేంకట
కవిగారికి గంకణంబు గాలికి దొడిగెన్'

దత్తపది. భారతార్థము - వాడి-నేడు-పోడి-వీడు-పండితులు.

'వాడియైనట్టిగద చేతబట్టి కొనుచు
నేడె భీముండు వచ్చిన నిలువదర మె?
పోడిమిం జూపకుండ నీపురుషశక్తి
వీడుకొన జెల్లునా? మీవ వీరులార!'
అనుచు భీష్ముడెదెయెలుగెత్తి వినగబలికె

నిషిద్ధాక్షరి - ద్రౌపదీ పరాభవము - (పండితులు.)

'ఇంతినింబట్టి కౌరవు లీడ్చినారు
ద్రోణ భీష్మాదు లటనుండి తొలగినారు
సభను సాధ్విని నేడ్పింప సాగినారు
కృష్ణుడా మెను గాపాడ నేడ్చినారు.

న్యస్తాక్షరి. సరాజ్యం గురుణా దత్తం ప్రతిపద్యాధికం బభౌ.

4. 9-1-1959 నాడు - ప్లవ వైశాఖ పూర్ణిమనాడు-పెద్దాపురం శ్రీ కన్యకా పరమేశ్వరి ఆలయంలో శ్రీ కేశవరపు కామరాజు పంతులుగారి అధ్యక్షతను జరగిన అవధాన సభలో.

ప్రార్థన -
ఎందరో! సత్కవీంద్రులు మ
  రెందరో! పాండితి సూరివర్యు లెం
దెందరో! దానశూరులు ని
  కెందరో! న్యాయముగొల్చువార లిం
కెందరో! వైశ్యసత్తము ల
  నేకులు గల్గిన యీసభాస్థలిన్
అందరిపోలె నన్ను గృప
  నారయుచుండుము మహేశ్వరీ! సదా!

'నలువది రెండు నావయసు
  నాటికి నేటికి నిన్ను వీడక
గొలుచుచు నిల్చియుంటి-నిను
  గోరున దొక్కవరంబు విఘ్నరా
జ! లలితమా త్వదీయజప
  సాంద్రత నిమ్ము-మనఃకపీశునిన్.
సలలితభక్తి రజ్జువున
  సాహస మొప్పగ గట్టివేయుమా.

సమస్య. శ్రీ దర్భా చలమయ్యశాస్త్రిగారు - హైస్కూలు పండితులు.

ఇంతిరో! వింతయేమి! యుదయించెను భానుడు పశ్చిమంబునన్.

'అంతట సైంధవాదుల! అ
హంకృతిఁ జూపుచు బాలుపైఁ బడన్
వింతగనవ్వఁ బెద్దలు వి
వేకము వీడియ కత్తిదూయుచున్
వంతలముంప బాలుఁడ! ది
వంబున కేఁగెను వచ్చెఁ బార్థుఁడే!
యింతిరో! ... ... ...

దత్తపది. సీతాకళ్యాణం_లంజ_సంజ_పింజ_పండితులు_

'లంజలా! రాము పెండ్లికి రాకయుంద్ర?
సంజయగుదాక నాట్యాల సలుపకుంద్ర?
సీత యందంబుఁ జూడగా జేరకుంద్ర?
పింజ పింజలుగా కాంతివెల్లు వలర?

నిషిద్ధాక్షరి. శ్రీరామ కల్యాణం.

'శ్రీరామ చంచత్కళ్యాణ
మంగళే ముద మాయయుః
లోకారాధ్య మునీంద్రాద్యాః
అమరా బాంధవాశ్చయే.'

వర్ణన. నడిమంతరపుసిరి యౌవనములకుగల సామ్యాలు_

'వెనుక ముందులఁ జూడక వికవిక మని
పెద్దపిన్నల భేదాల విడిచిపెట్టి
సిగ్గు బిడియాల విడనాడి చెలఁగుచుంద్రు
జవ్వనంబున సిరియందుఁ జాలమంది.'

వ్యస్తాక్షరి – కమలయోని రివాభాతి_కనుల కెపుడు. సభాధ్యక్షులపైఁ జెప్పిన ఆశుపద్యాలు –

'ఆశాపాశము లేక నె
ప్రాశస్త్యమునందియుండి ప్రస్తుతమతివై
క్లేశాలెఱుఁగని ధీయుత!
కేశవరపు కామరాజ! కేల్మోడ్తువఁ దగున్'

శ్రీ చలమయ్య శాస్త్రిగారిపై జెప్పినది.

'దర్భా చలమయ శాస్త్రియు!
నిర్భర పాండిత్యయుక్త నిపుణవచస్కుం
డర్భకుల కొజ్జ! కులమున
నిర్భయుఁ డీ పండితుండు నిర్మల
మతియున్'

( సశేషం )

# వసుచరిత్ర - తెలుగుపదశ్లేష

– శ్రీ పొనుగోటి అర్జునరావు

( గతసంచిక తరువాయి )

**నాళీక ముఖికి నెన్నడుము...**
**చారువేణికి వింత చవుల నింపులు మీఱె**

ఇందు శుక్తిమతిని గర్భిణీ స్త్రీ పరముగను, శరత్కాల నదీపరముగను వర్ణించినాడు. సామాన్యముగా గర్భము ధరించిన స్త్రీలు ఆహారవ్యవహారములలో నానా రుచులు కావలయునని కోరుదురు. ముఖ్యముగా పులుపు, ఒగరు ఎక్కువగా కోరుట సర్వజన విదితమైన విషయమే. ఇందు కోలాహలునిచే గర్భము ధరించి శుక్తిమతి యను కన్నె ప్రత్యేక రుచులు కోరుచు అతిశయముగా నుండె నని ఒకర్థము. నదీపరముగా చూచినచో శరత్కాల వర్ష ప్రభావమున ఏరులన్ని ఏకమై సరికొత్త నీటితో నిండి అందమైన ప్రవాహములో నానారుచులుగల నీరు ఒకేచోట ప్రవహించుచు మధుర మనోహరముగా కన్పట్టె నని అర్థాంతరము. 'చవి' అనుపదం రుచి అను అర్థములో ఇప్పటికిని సర్వజన సామాన్యమైన వాడుకలోనున్నది.

**ఆపన్న సత్వ యాపగ...**
**యా పగిదిన్ 'నీరుమోసి' యధిగత సేవా.**

ఇందు శుక్తిమతిని గర్భముగల స్త్రీ పరముగను నిండుదనముచే నిండిన నదీ పరముగాను చెప్పినాడు. గర్భముధరించిన స్త్రీలు నిండుగా, నీరు ఎక్కువ గలవారై యుందురు. కాబట్టి శుక్తిమతి యను కన్నె గర్భము ధరించి నీరు మోయుచు నిండుగా నుండెనని ఒకర్థము. శరత్కాలములో నీరుతో నిండి గంభీరముగా కన్పించు నదులు కూడ అలాగే తొణకకుండ నుండు నని అర్థాంతరము.

**కనుగల వింటఁ జొక్కపు చవుల్వ**
**ట్టించి...**
**చిగురాకు, మొనల 'నాకులపాటు'**
**మొనయ జేసి**

ఇచ్చట గిరికా వసురాజుల పరస్పర దర్శనముచే ఒకరిపై నొకరికి అనురాగం వృద్ధినొందు చుండగా మన్మథుడు దానికి తోడ్పడి మరింత చేసి తన కుసుమ బాణములచే నానావిధావస్థలకు గురిచేసినాడని ఒకర్థము. మన్మథుడు పుష్పసాయకుడు చిగురాకు తూపు మొన జేసి ఆకులపాటునకు కారణమైన సాధనంచే వ్యాకులతయనెడి సంచారిభావమును పొందించెనని చెప్పబడినది. ఆకులపాటు అనగా చిగురుటాకులయొక్క మొన యనియు, వ్యాకులత యనియు రెండర్థములు.

**అనయము నీ మహోవవము...**
**...రేము కడవారము గాదు సుమయ్య**

ఈ పద్యమున గిరిక, చెలికత్తెలు వసురాజును చూచినది మొదలు ఆనంద సంభరితాంతరంగలై ఆతని రాకను స్తుతించుచు గిరిక ఎల్లప్పుడు ఆతని విజయ గీతికలనే పాడుచుండు ననియు, వారు ఎల్లప్పుడు ఆతనినే స్మరింతురనియు చెప్పుచు 'కడవారము కాము' అనిరి. అనగా మీకు దూరము వారము కామనియు మీదగ్గరలోనే ఉందు మని ఒకర్థము. మీ యా పాలనలోని వనమధ్యమున నే యున్నామనియు, మీ సంరక్షణలోనే యుందుమనియు రెండవయర్థము.

**పోలని తటిల్లతాంగి ...కలధ్వను**
**ల్గల కలకంఠులం 'గడిమి గాటపునెమ్మి'**
**నటింప...**

ఇట గిరికాదేవి తన చెలికత్తెలు మాటలాడు పరిహాసపు మాటలకు సిగ్గుబిడియములతో శృంగారకోపము గలదై వారిని 'గదిమి' అనగా అదలించి సన్నగా కనిపించుచున్న మేను గలదై అటునుండి వెడలి పోయెను. మెరపు పరముగా చూచినచో వర్షాకాలమందు తమ కలకంఠములతో కిలకిలారావములు చేయుచున్న ఆడు కోయిలలకు ఒక్కసారిగా తళుక్కున మెరసి వాటినన్నింటిని అదలించి అనగా కలవరపాటు నొందించి వెంటనే నల్లని మేఘముల చాటున మాయమయ్యె నని రెండవ యర్థము. గిరికాపరముగా చూచినచో గాటపు నెమ్మి అనగా చెలికత్తెలయందు తనకు గల ప్రేమ సన్నిహితత్వములచే వారిని అదలించినదని ఒకర్థము. రెండవ అర్థపరముగా చూచినచో శరత్కాల మేఘచ్ఛాయను చూచి నెమలి సంతసించి పురివిప్పి నాట్యమాడిన దట.

అళి హస్తావలంబనం బడర...
సాగ నీదయ్యెఁ 'గన్నీటిజడిఁ గడంగి

గిరికా వసురాజులు ప్రథమ సందర్శనమునందే పరస్పరానురాగాంరతంగు లైరి. గిరికాదేవి తనను వదలి పోవుచుండగా మదియందు చింతించుచు చివరకు గిరిక కొంత దూరము సాగిపోగానే వసురాజునకు ఆమెపై గల పీడని అనురాగాతిశయముచే కన్నీరు ఎడతెగకుండ వచ్చుచు అతని చూపునకు గిరికను కనబడకుండ చేసె నని ఒకర్థము. సూర్యుని పరముగా చూచినచో సూర్యుడు కన్యా రాశియందు, హస్తానక్షత్రమున నుండి నపుడు ముసురు పట్టి ఎడతెడకకుండ నుండును. అప్పుడు. సూర్యునియొక్క కిరణప్రసారము గాకుండ ఏకధారగా వర్షము కురిసిన దని రెండవ అర్థము.

'కనుగొంటి లతకూన నని డాయు ...
...పరితాప గరిమఁ 'దామరలఁ' జూచు'

వసురాజు గిరిక అచటి నుండి పోయి నది మొదలు వివిధ సంచారి భావములకు లోనై ఏది చూచినను గిరికనే చూచితి నన్న చింతనతో ఉండును. అట్లు చూచుచు పద్మములను చూచి పద్మినీ జాతి స్త్రీయైన గిరికను చూచితి నని భ్రమ నొంది కాదన్నచో చెంతకుపోయి తామర పువ్వులను చూచు నని ఒకర్థము. అప్పటికిని సంశయము తీరక నిశితముగా చూచుచు అచ్చటినుండి మరలి వచ్చెద నని ఆతని మనస్సులో అనుకొనె నని రెండవ యర్థము.

గిరికన్య మేన నేకీభవించిన గాని...
...మిహికాంశు 'కనుసన్న' మెలపరాదు

ఇందు వసురాజు విరహానలదగ్ధుడగుచు గిరికను స్మరించుకొనుచు నుండుచుండెను. అప్పుడు నదీసంభవయైన గిరికాదేవిని తన యెదపై నుంచుకొనిన కామోద్దీపన కారకుడైన చంద్రుని తన వశము చేసికొనవచ్చునని ఒకర్థము. క్షీరాబ్ధి సంభవయైన లక్ష్మీదేవిని విష్ణువు ఎదపై నుంచుకొని నట్లుండి విష్ణుత్వమును పొందిన చంద్రుని తన కన్నుగా నుంచు కొనవచ్చునని ఆతని మనోగత వేదనమును తెలుపు రెండవయర్థము,

లలనా రత్నము నొయ్యనొయ్య మొన
వ్రేల 'న్నేల వ్రాయించి'...

మన్మథుడు గిరికాదేవికి వసురాజుపై గల విరహచింతనచే దశవిధావస్థలకు లోనుగావించి ఆ విరహ వేదనా విద్యకు మొట్టమొదట అక్షరములు దిద్దబెట్టించి నట్లు ఆమె కాలి బొటన వ్రేలితో నేలపైని వ్రాయించె నని ఒకర్థము. సామాన్యముగా ఎవరైనను ఏదో ఒక చింతతో నున్నపుడు ఏమీ తోచక నేలపై కాలిచేగాని చేతి వ్రేలుచేగాని గీతలు గీయుట సహజము. ఆవిధమే ఇచ్చట గిరికయందు చెప్పినాడు. ఇచ్చట వసురాజుపైమరులు గొనియున్నది. ఏమి చేయుటకు పాలుపోక ఆవిధంగా అన్యమనస్కముగా మొనవ్రేలితో వ్రాయుచున్న దని సహజార్థము.

ఆతన్వంగి యనంగ ఝూంకరణ ... ని
ర్ఘాతంబోర్వక 'తమ్ములంచుఁ' దటినీ
గర్భాశ ...

ఆవిధంగా అనంగుని బాణాహతి కోర్వలేని మనస్తాపము గలదై ఆగిరికాదేవి ఎటు తోచక శుక్తిమతీ నదియందు గల తమ్ముల (పద్మముల) చెంతను నిలచిన తన శరీర తాపము చల్లారి శాంతి చేకూరునని తలచినదని ఒకర్థము. గిరిక కూడ నదీ సంజాత 'తమ్ములు' (పద్మములు) తనకు తమ్ములు (తోబుట్టువులు). అవి ఆమెను ఓదార్చునన్న తలంపుతో సోదర భావంతో వాటి దగ్గర తల దాచుకొనెద నని అనుకొనె నని రెండవయర్థము.
అనిల కుమారకుండు...

ఘన వన రాశిలోఁ 'బుడమి కానుపు'
పద్మిని ...

ఇందు సీతాదేవి, మెట్టతామర – ఈ రెండర్థములుగా చెప్పబడినది. 'పుడమి కానుపు' అనగా సీతాదేవి. ఆమె రావణాసురునిచేగొనిపోబడి గొప్పదైన అడవి

విలో చిక్కిపోవగా ఆంజనేయుడు పోయి రాముని కరముద్ర చూపినాడట. రెండవ అర్థములో పుడమికానుపు అనగా భూమిపై పుట్టిన మెట్టతామర అడవిలోని చెట్లమధ్య చిక్కి వాడిపోవగా మలయమారుతము వీచి చెట్లయొక్క ఆకులను తొలగించి సూర్యకిరణ ప్రసారం ఆతామరపై పొడ చూపించి వికసింప జేసె నట.

కలికి 'నీచేపట్టు' గఅది'మాకందంబు'...

చెలికత్తెలు గిరికాదేవితో మాటలాడుచు ఓ చెలియా! 'నీచేపట్టు' అనగా నీచే స్పృశింపబడు నది రసాల వృక్షము అని ఒకర్థము. అనగా పద్మినీ జాతిస్త్రీయొక్క ఒక్కొక్క అవయవముతో ఒక్కొక్క చెట్టును తాకినచో పుష్పించి ఫలించు నందురు. గిరికాదేవి పద్మినీజాతి స్త్రీ. అందువలన ఆమెచే స్పృశింపబడు మాను (మ్రాను) రసాలవృక్ష మగును అని ఒకర్థము. రెండవయర్థంలో ఆమె చెలికత్తెలను ఆమె (గిరిక) చేతి యందు గల దేదైనను అందముగనే కనిపించు నని భావము.

ఈ విధముగా రామరాజ భూషణుడు తన శ్లేష కావ్యమును తన ప్రబంధ రచనా పాటవముచే ప్రకృష్టముగా తీర్చి దిద్దెను. పండిత విమర్శకుల అభిప్రాయము ప్రకారము తన కావ్యము అలంకార ప్రధానమైన దైనప్పటికిని చిత్రకవిత్వముగా జమకట్టబడకుండ రసోచిత వర్ణనలతో ప్రతిపద్యమునందును సామాన్యముగా సూర్యునితో సమన్వయము చెప్పుచు నాయకుడైన వసురాజు ఔన్నత్యమును మనకు స్ఫురింప జేయు చున్నాడనుటలో కించిత్సందేహమూ లే దని చెప్పవచ్చును.

——o——

# మానవ సౌభ్రాత్రమ్

— అభినవ కాళిదాస
శ్రీ తెల్కపల్లి రామచన్ద్రశాస్త్రి

*సౌభ్రాత్రం యది లభ్యతే సుజనతా
  సాధ్యంపరం మానవై
ర్యై స్తేషాం న భవ న్త్యకీ ర్తినిలయాః
  కామాదయో దుర్గుణాః
దమ్భాద్యా శ్చ తతో భవ త్యనుపమం
  శ్శ్రేయసం లభ్యత
స్సౌభ్రాత్రం లభ తార్థదం హితకరం
  భో! భారతీయా జనాః.

*సౌభ్రాత్రేణ సమత్వధీస్సుమహితా
  తస్యాః కృపా ప్రాణిషు
దాతృత్వం తత ఆదరో జనకృత
  స్తస్మాద్యశ స్సుస్థిరమ్
తస్మా త్సౌఖ్యముదే త్యనన్య సులభం
  పుంసా మతోధీమతాం
తత్సౌభ్రాత్రమలం లభధ్వ మతులం
  భో! భారతీయా జనాః.

*పార్థశ్శ్యోపగతౌజనాఽహితకరౌ
  సౌభ్రాత్ర మాహాత్మ్యత
స్సాయుజ్యం సముపేత్య గన్ధకరసౌ
  శుద్ధౌ సుయోగాన్వితౌ
యల్లోకామయజాల వఞ్చన చణౌ
  జాతౌ వత స్సుస్థిరం
సౌభ్రాత్రంభజ తార్థదం హితకరం
  భో! భారతీయా జనాః.

*నానాశాస్త్ర కృతశ్రమైః కుశలిభి
  ర్నిత్యైక పత్నీరతైః
కాన్తేయై రహితాః పరస్పర పత
  త్సౌహార్ద హీనాః ఖలాః
సౌభ్రాత్రేణ రణేహియేన కుటిలా
  స్సర్వే జితాః కౌరవా
స్తత్సౌభ్రాత్రమలం లభధ్వ మధునా
  భో! భారతీయా జనాః.

*రామస్సత్య పరాక్రమోఽపి
  బలవా న్శస్త్రాస్త్రయుక్తోఽపి స
న్సుగ్రీవాది సమస్త వానర తతే
  స్సౌభ్రాత్ర మేకం వినా
సోమి! తే శ్చ దశాననం జిత జగ
  ద్ధస్తం యతో నాఽశక
త్తత్సౌభ్రాత్రమలం లభధ్వ మతులం
  భో! భారతీయా జనాః.

*అస్మద్దేశ రసా సమాక్రమణధీ
  లబ్ధాఽనయ ప్రాభవ
త్యక్త ప్రాణభయాన్విహ్రియా విరహితా
  న్ద్వేశాప హారోద్యతాన్
సౌభ్రాత్రేణవయం జయామ సహితా
  యేన ద్విష స్సాయుధాన్
తత్సౌభ్రాత్రమలం లభధ్వ మధునా
  భో! భారతీయా జనాః.

*అంభోజం రవిణా జలేన చ సమం
  సౌభ్రాత్ర మేత్యాన్వహం
స్వచ్ఛన్దం వికసల్లసజ్జనశిరో
  ధార్యం సుగంధాన్వితమ్
పూజార్హం మధుపాతిథి ప్రియకరం
  జాతుస్వత స్సుస్థిరం
సౌభ్రాత్రం భజతార్థసిద్ధిద మలం
  భో! భారతీయా జనాః.

*సేనాన్యామ్బు ముచా యదేత్య కుశలీ
  సౌభ్రాత్ర మేకం శిఖీ
జ్యౌతిష్కో విబుధో యథాకృషికృతాం
  వృష్టిం ముదావేదయన్
సానన్దం సహపూజ్యతే బుధజనై
  ర్నిత్యం కుమారేణ త
త్సౌభ్రాత్రం లభ తార్థదం హితకరం
  భో! భారతీయా జనాః.

*యేసౌభ్రాత్ర ముపార్జయన్తి కుశలా
  స్తే ధైర్య సమ్పద్యుతా
స్తన్వానా బహుదుర్గుణౌ విషురయా
  చ్ఛార్దూల విక్రీడితమ్
స్నాతా శ్శాన్తి సరిత్సుతౌ సుఖసుధా
  లిప్తాశ్చ జీవ న్త్యత
స్సౌభ్రాత్రం లభతార్థసిద్ధిద మలం
  భో! భారతీయా జనాః.

'(ఆకాశవాణి — హైద్రాబాదు కేంద్రం సౌజన్యంతో')

——...——

# ఈ పక్షంలో

## సమాచారం రజతోత్సవ సభ

పైసభ 26-7-81 తేదీ ఆదివారం సాయంకాలం గం 6-30లకు రాజమండ్రి శ్రీ వేంకటేశ్వరఆనం కళాకేంద్రంలో జరగినది. సభకి నవభారతి (శ్రీ సత్యసాయి) గురుకుల వ్యవస్థాపకులు శ్రీ తన్నీరు బుల్లెయ్య ఎం. ఏ, బి. యిడి (మాజీ ఎం. ఎల్. సి) గారు అధ్యక్షత వహించిరి. ఆంధ్ర ప్రదేశ్ శాసనసభ స్పీకరు శ్రీ. కోన ప్రభాకరరావుగారు సభాప్రారంభము గావించిరి. శ్రీ నార్ని కేదారేశ్వరుడుగారు స్వాగతముపల్కిరి.

ప్రోగ్రాము ప్రకారం 6 గం॥ లకు ప్రారంభం కావలసిన సభ వర్షంకారణంగా 6-30 గం॥లకు నిరాలస్యంగా ప్రారంభం కావడం విశేషం! ప్రోగ్రాము ప్రకారం వివిధ కార్యక్రమ నిర్వాహకులు కావలసిన శ్రీ సంగిత వెకంటరెడ్డి, శ్రీ ఏ. కె గోయల్, శ్రీ ఎస్. బి. పి. బి. కె. సత్యనారాయణరావు, శ్రీమతి ఎం. ఎస్. విజయలక్ష్మిగారలు సభకి రాకపోయినా ఆపద్ధర్మ నిర్వాహకులుగా శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య శ్రీ పోతుకూచి సాంబశివరావు, శ్రీ ఎ. కె. మహేశ్వరి, శ్రీ భమిడిపాటి కృష్ణమోహన్ గారలు ఆదుకొని సభా కార్యక్రమాన్ని నిరంతరాయంగా చురుకుగా కొనసాగించడం జరగినది. సభసుమారు గం 8 లకు పూర్తి కావడం నిజంగా హర్షణీయం.

సభాప్రారంభంలో పాడిన వందేమాతరం గీతం ఎంత శ్రావ్యంగా ఉన్నా-దోషరహితంగా ఉండాలన్న ఆలోచన స్వరాజ్యంవచ్చిన ముప్పదియైదు సంవత్సరాల తరువాతనైనా గ్రహింపబడక పోవడం చాల దురదృష్టకరం... పులకిత యామినీ, శోభినీ, సుహాసినీ, సుమధుర భాషిణీ...వంటి పదాలు ద్వితీయాంతాలుగా ఉండాలనే సంగతి ఎంత త్వరగా గ్రహించి ఆచరణలో చూపితే అంత మేలని వేఱుగా చెప్పనక్కరలేదు.

భారత ప్రభుత్వోపాధ్యక్షులు, కొందఱు కేంద్రమంత్రులు, రాష్ట్రమంత్రులు, ప్రముఖులు పంపిన సందేశములు కొన్ని చదువబడినవి కాలాతీతమగునని ఇంకను అనేక సందేశములు కాని, పంపినవారి పేర్లు కాని చదువబడక పోయినను అందఱకు కృతజ్ఞతలు తెలుపబడినవి

సంపాదకులు శ్రీ గంధం సీతారామాంజనేయులుగారి వినయసౌజన్యములు కార్యనిర్వహణ దీక్ష ప్రముఖులందఱిచే కొనియాడబడినవి. ఇతర వైశిష్ట్యముల మాట అటుంచి, అనేక సాధక బాధకములను ఎదుర్కొంటూ 25 సంవత్సరములు అవిచ్ఛిన్నంగా దినపత్రిక నడపగలిగిన ఒక్క అంశమునకే ఆంజనేయులు గారిని ప్రశంసించదగు నని వక్కాణించిరి. ఇతోధికముగా పేపరు వర్ధిల్లవలెనని ఆకాంక్షించిరి.

సమాచార రజతోత్సవ సంచిక ఆవిష్కరింపబడినది. ముఖపత్రము ఆకర్షణీయముగా కనబడినది. సమాచారం సిబ్బందికి, సమాచార పత్రికతో సంబంధము గల అనేక ప్రముఖాతి పముఖులకు; రజతోత్సవ సంచికలు, జ్ఞాపికలు [మెమెంటోలు] బహూకరింపబడినవి. మఱి కొందఱు ప్రదాన యోగ్యులు దృష్టిలో ఉన్నారు కాని కాలాతీతమగుచుండుటచే తరువాత వారికందజేయబడు నని తెల్పబడినది. సభాప్రారంభమునకు ముందు సభానంతరము వర్షము అధికముగా పడినను సభ జయప్రదమైనది.

* * *

## మందానిల సందేశ – సంస్కృత కావ్య – ఆవిష్కరణ సభ

పై సభ 19-7-81 ఆదివారం సాయంకాలం గం 7 లకు రాజమండ్రి శ్రీ దుర్గా వెంకట రమణారావు కల్యాణమండపములో జరగినది. ఆంధ్రవిశ్వవిద్యాలయం ఆర్ట్సు అండ్ కామర్సు కళాశాల అధ్యక్షులు శ్రీ యస్. వి. జోగారావుగారు సభకి అధ్యక్షత వహించిరి. ఇన్ కంటాక్సు అఫీసరు శ్రీ పానుగంటి శ్రీరామమూర్తి గారు సభాప్రారంభము గావించిరి.

శ్రీ విశ్వనాథ గోపాల కృష్ణశాస్త్రి గారు(ఓరియంటల్ కాలేజి ప్రిన్సిపాలు) శ్రీ పేరి సర్వేశ్వర శర్మగారు మందానిల సందేశ సమీక్ష చేసిరి. శ్రీ కందుకూరి చిన రామచంద్రమూర్తిగారు శ్రీ చిన్మయ బ్రహ్మ కవిని సభకి పరిచయం చేసారు. ప్రముఖులందరు ఈకాలంలో సంస్కృత కావ్యరచనను నిర్వహించినందుకు కవిగారిని పెక్కువిధముల శ్లాఘించినారు. 'మందానిలసందేశము మేఘసందేశమునకు దీటుగానున్నది' అను మాట ఒక్కటీ రాకుండా ఉన్నచో కాళిదాసుకీ కవిగారి కీ న్యాయము చేకూర్చినట్లయ్యేడిది. కాళిదాసు రచన తన మందానిల సందేశ రచనకు ఉద్దీపకము అన్న కవిగారి సమాధాన వాక్యము గమనింపదగినది.

మందానిలసందేశము సి. టి. ఓ. శ్రీ యస్. రామాచారిగారిచే సీతారాములకు అంకితము చేయబడిన గ్రంథము.

శ్రీ గ్రంథి సుబ్రహ్మణ్యముగారు కవి దంపతులను, వేదికపైనుండి కార్యక్రమమున పాల్గొన్న పండితులను ఘనముగా సత్కరించినారు. ఆరంభమున శ్రీ కందుకూరి కొండావధానులుగారు వేదమంత్ర పఠనముతో శ్రీ చిన్మయ బ్రహ్మకవిగారిని ఆశీర్వదించి వారిశిరసుపై అక్షత లుంచిరి. శ్రీ పప్పుళ్ళ మీరాదాసు గారు గావించిన నాదస్వర కచేరీని సభాధ్యక్షులు ప్రశంసించిరి.

శ్రీ బీరా బసవరాజుగారి వందనసమర్పణముతో సుమారురాత్రి గం.10-30 లకు సభ పూర్తియైనది.

——...——

# సమాలోచన సంపుటములు

వివిధ సాహిత్యాది విషయాలకు చెందిన 241 రచనలతో కూడిన సమాలోచన తృతీయ సంపుటము 24 సంచికలు ఒకే వాల్యూముగా హాఫ్ క్యాలికో బైండు చేయబడి అమ్మకమునకు సిద్ధముగా నున్నది.

వెల రు. 20 లు. ఎం. ఒ. ద్వారా పంపినవారికి పోష్టుఖర్చులు మేమే భరించి రిజిష్టర్డు పోష్టులో పంపగలము. వి. పి. పద్ధతి లేదు.

మొదటి, రెండవ సంపుటముల వాల్యూములు పూర్తిగా అయిపోయినవి.

— సంపాదకుడు.

అడ్రసు :—

సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,

రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జె. కాలేజి,

6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.